# శ్రీ వల్లూరమ్మ చరిత్ర మహిమలు

(సుప్రభాతము, మేలుకొలుపు, అష్టోత్తరములు,
భజనపాటలు, మంగళహారతులు)





రచన :
గంగిశెట్టి నరసింహారావు

ప్రతులు : 500

ప్రచురణ : 2002

వెల : రు. **10-00**

పుస్తకములు దొరకుచోటు :

**1. శ్రీ వల్లూరమ్మ దేవస్థానం దగ్గర**
వల్లూరు (పోస్టు) ప్రకాశంజిల్లా

**2. జి. రామాంజనేయులు** బి.ఏ. బి.ఇడి. **టీచరు**
మద్దిపాడు (పోస్టు) ప్రకాశంజిల్లా

ముద్రణ :

**డి. బి. ప్రింటర్స్**
28-17-17, అరండల్ పేట
విజయవాడ-2
ఫోన్ : 434852



## "రచయితగా నా మాట"

మద్దిపాడు నుండి ఉలవపాడుకు బదిలీ అయిపోతు శ్రీ వల్లూరమ్మను దర్శించటం జరిగింది. ఉలవపాడులో టీచరుగా పనిచేయుచున్న వల్లూరు నివాసి శ్రీ ఎ. కోటేశ్వరరావును అమ్మవారి చరిత్రను గురించి అడిగాను. వారు వల్లూరులోగల కరణీకులు శ్రీ టంగుటూరి కోదండరామ మూర్తి వద్దకు పంపగా అమ్మవారి చరిత్రనంతా రికార్డుపూర్వంగా చెప్పారు. అర్చకులుగా ఉన్న శ్రీ బద్దెపూడి కృష్ణ పూర్వీకులు చెప్పుకొను కొన్ని చారిత్రక విషయములు తెలిపారు. అమ్మవారి వారసులు హైదరాబాదులో వున్న శ్రీ అద్దంకి సూర్యనారాయణద్వారా కొన్ని విషయములు తెలిశాయి.

ఒంగోలు మందపాటి రాజుల చరిత్ర (శ్రీ రామచంద్ర విజయం) వెంకటగిరి సంస్థానం. వెలుగోటి వంశజుల చరిత్ర కొంతవరకు ఉపయోగ పడింది.

ఈతముక్కల జ్వాలాముఖి అమ్మవారిని గురించి నాగం వెంక టేశ్వర్లు, శంఖుల చంద్రశేఖరం కొంత తెలిపారు. మడనూరు జ్వాలాముఖి పుట్టుకను గురించి శివాలయ పూజారులు శ్రీ మడనూరు చెంచుసుబ్బయ్య గురుకులు మల్లిఖార్జున, లింగారెడ్డి జాలిరెడ్డి, సామంతుల వెంకటసుబ్బయ్య తెలిపారు.

ఒంగోలులోని పిల్లుం రామజోశ్యులు, అద్దంకివారు, సింహాద్రి పంతులు, శ్రీ నాగేశ్వరరావు తదితరులేగాక అమ్మవారి వలన ప్రయోజనం పొందిన కొందరి భక్తుల అనుభవాలు వ్రాశాను.

ఇ.ఓ. శ్రీ భూషయ్య, శ్రీ కోటేశ్వరరావు కొన్ని అభివృద్ధి కార్య క్రమములు తెలిపారు. వారిరువురు యీ ప్రచురణకు గాను కొంత ఆర్థిక సహాయం (రు. 1000/-) చేశారు. ఇలా విషయ సేకరణలో సహకరించిన

అందరికి నా వందనములు. ఉల్కాముఖి శ్రీ వల్లూరమ్మ వారందరిని సర్వదా కాపాడుగాక.

అమ్మవారు దర్శనమే కాకుండా ప్రతిఒక్కరు ఇంటి వద్ద కూడా అమ్మవారి సుప్రభాతం, మేలుకొలుపు, అష్టోత్తరములు, భజన పాటలు, మంగళహారతులు చదువుకొనుటకు వీలుగా ప్రచురించాను. స్మరించండి. తరించండి. ఏదైనా లోపములు ఉన్నచో దయచేసి తెలియపరచ మనవి.

— రచయిత.



**అద్దంకి సూర్యనారాయణశర్మ**
ఇం. నెం. 2-51, వీధి నెం. 1,
వాణీనగర్, మల్కాజిగిరి,
హైదరాబాద్-47.

శ్రీయుత నరసింహరావుకు, ఉభయకుశలోపరి. మీరు వల్లూరమ్మను గురించి తెలుపవలసినదిగా వ్రాశారు. చాల సంతోషం. మా పూర్వీకులు చెప్పుకొను విషయములు కొన్ని రికార్డు చేయటం జరిగింది.

ఒంగోలు మందపాటి రాజులకు, వెంకటగిరి రాజులకు అధికారం కొరకు తరచు తగాదాలు, కొట్లాటలు జరుగుచుండేవట. దానివలన జనం బాధలు అనుభవించేవారు. దానిని నివారించుటకు మా వంశంలోని దేవీ ఉపాసకులు, మందపాటివారికి ఆంతరంగికులు అయిన అద్దంకి రామచంద్రయ్యను సలహా అడిగారు.

వారు అంగబలం, అర్థబలం కలిగిన వెంకటగిరి వారిని ఎదుర్కొనుటకు, మహా యజ్ఞంచేసి, ఆది పరాశక్తిని ఆవాహనంచేసి, తద్వారా వారిని త్రిప్పికొట్టవచ్చని సలహా ఇచ్చారు. దానికి మందపాటివారు అంగీకరించి మహా యజ్ఞాన్ని ఏర్పాటు చేయవలసినదిగా సూచించారు.

మొదట జ్వాలాముఖి తర్వాత ఉల్కాముఖి అమ్మవారలు రావటం, జ్వాలాముఖి ఈతముక్కలకు పోవటం, ఉల్కాముఖి వల్లూరులోనే నిలచి, ప్రజలను కాపాడతానని ఆజ్ఞ ఇవ్వటం జరిగినట్లు తెలుస్తుంది.

ఉల్కాముఖి వల్లూరులో నిలచి, అనేక మహిమలు చూపించుటచేత వల్లూరమ్మగా నేటికి ప్రసిద్ధి చెందుచున్నది. మా ఇంటి ఆడపడుచుగా అనాది నుండి ఆరాధిస్తూ, పూజాది కార్యక్రమములు మొదటి నుండి మా వంశ జులే జరుపుతున్నట్లు వినికిడి. 1770, 1779 నలనామ సం॥రం దేవాలయ నిర్మాణం, ప్రతిష్ట జరిగినట్లు గుడిలోపల బండరాయిపై శాసనం చెక్కి ఉన్నది.

నేను ఉద్యోగరీత్యా ఊరు వదలి హైదరాబాదు పోతూ,మా ఇంటిని అమ్మవారికి ఉచితంగా ఇచ్చుటయేగాక దసరా ఉత్సవములందు అమ్మవారి వేడుకలకుగాను ఒంగోలు బ్యాంకులో పదివేల రూ॥లు ఫిక్సడ్ చేసి, దానిపై వచ్చు వడ్డీని వినియోగించవలసినదిగా కోరియున్నాను. ఈత ముక్కల జ్వాలమ్మ కూడా కొంత సహాయం చేయుట జరిగింది.

ఇంకా ఏమైనా విషయములు కావాలనుకొంటే శ్రీ కోదండరామ మూర్తిని, మడనూరు శ్రీ జాలిరెడ్డిని, అర్చకులు శ్రీ కృష్ణమూర్తిని అడిగి తెలుసుకొనవచ్చును. మీరెవరో నాకు తెలియకపోయినా అమ్మవారి చరిత్ర వ్రాస్తున్నందుకు నా ఆశీస్సులు.

## సేవామిత్రకు అభినందనలు

ఆర్ష విజ్ఞాన మందించు గ్రంథాలయపాలకోద్యోగ లక్ష్మికి తృప్తి నొసగినావు
పలుకుల రాణి సంబరపడ గేయాల విరుల శిరంబున దురిమినావు
స్థల-చరిత్రముల, పిల్లల పుస్తకముల, రచించి పాఠకుల కందించినావు
సాంఘికా, ధ్యాత్మిక, సరస సంగీత సాహిత్య సభల నిర్వహించినావు
"షిర్డిపర్తి సాయిమహిమ" దెల్పుకృతిని
వెలువరించి సత్కీర్తితో వెలగినావు
గంగిశెట్టి వంశాబ్దికి కలువరాయ
స్నేహసంధాయ! జీ నరసింహరాయ.

"మధురకవి"
ఘల్లవరపు జాన్, చీమకుర్తి.

# శ్రీ వల్లూరమ్మ చరిత్ర: మహిమలు

"మధురకవి" **మల్లవరపు జాన్**, చీమకుర్తి.

మందపాటి వీరమన్నీలు పెళ్ళూరు పాలనంబు చేయుకాలమందు
వెంకటగిరి రాజవీరులా-రాజుల తలలు ద్రుంప ఘర్షణలకు దిగిరి.
అంతరంగికుండు అద్దంకి రామచంద్రయ్య మందపాటి రాజవరుల
గాంచి యజ్ఞమొకటి గావించినన్ అదిక శక్తి వచ్చునని వచింప.
ప్రాజ్ఞులు మందపాటి నరపాలురు సత్క్రతు దీక్షతో మహ
ర్షిజ్ఞవరున్ బరూరి నరసింహయతీంద్రుల చేతిమీదుగా
యజ్ఞము నిర్వహింపగ భయంకర జ్వాలికలందు శక్తి స
ర్వజ్ఞ జనించె జ్వాలముఖి, రమ్యత ఉల్కల మౌఖిపేరులన్.
వెలసెన్ జాలమపేర జ్వాలముఖిదేవి రూపమై ఈతము
క్కల గ్రామంబున, ఉల్కాలాముఖీయు అక్కన్ బాసివల్లూరు ప్ర
క్కన వల్లూరమ పేరుతో వెలసె, భక్తశ్రేణి కీర్తింప చె
న్నల రారెంగద! మందపాటి అవనీ నాథుల్ జయంబందగన్.

1) కష్టములు తీరువారు పొంగళ్ళు బెట్టి
పానకము, వడపప్పు సాంబ్రాణితోడ

2) పూజలును, జాతరలు జేయుపూను కొనరె?
కలియుగాంతపు దేవతగా దలంచి.

3) సంతానహీనులు సాగిలపడి వేడ
దివ్య సంతతి ప్రసాదించినావు.

4) రోగాలతో వచ్చి రోదించి ప్రార్థింప
ఆరోగ్య ధనమిచ్చి యంపినావు

5) ఆపదలందు నిన్నాశ్రయించినవారి
చెంతకు జని కటాక్షించినావు

6) అడుగుట తడవుగ నభిమతంబుల దీర్చి
కల్పవల్లిగ పేరుగాంచినావు

7) వాహనము లాపి, నీ గుడివద్ద నిలచి
తలచుకొని బయలుదేరు చోదకులకెల్ల

8) మేలు జేసెదవమ్మా! మమ్మేలుమమ్మా!
కూరిమి వరాలు వెల్లి వల్లూరుతల్లి.



# మనసులో మాట

డా॥ అంగిరేకుల
వెంకటేశ్వరరావు

శ్రీ వెంకటేశ్వర హాస్పటల్,
ట్రంకురోడ్డు, టంగుటూరు.

మిత్రులు కోటేశ్వరరావు వీరిని తీసుకొని నా దగ్గరకు వచ్చారు. వల్లూరమ్మను గురించి ఏమైనా తెలిసి ఉంటే చెప్పమన్నారు. మా కాలంలో ఇలా జరిగింది. అలా జరిగిందని పెద్దలు చెప్పుకొనేవి వింటున్నామే కాని వాస్తవం తెలియదు. అది 300 సం॥ల నాటి చరిత్ర.

ఒక పని తలపెట్టినప్పుడు వ్యయప్రయాసలతోగాని జయప్రదం కాదు. దానికి విశ్వాసము పట్టుదల ఉండాలి. అమ్మవారివలన నాకు యీ మేలు జరిగిందని రచయిత చెప్పినప్పుడు నాకు చాల సంతోషం కలిగింది. కారణం అమ్మవారి అనుగ్రహమువలన నాకు కూడా ఒకటి రెండు అనుభవములు కలిగాయి.

అయితే చరిత్రకు సంబంధించినంత వరకు ఆధారములుంటే బాగుండునని సలహా యిచ్చాను. వారు కూడా కొన్ని వాస్తవములను సేకరించటం దీని ద్వారా తెలుస్తుంది. అమ్మవారిపై కొన్ని శ్లోకములు ప్రచురించితే బాగుంటుందని సూచించాను. యాజ్ఞీకం నుండి స్వయంశక్తిగా ఉద్భవించినదగుటచేత శాస్త్రానుసారం పూజలు జరుగుచున్నవి. జంతు బలులను అమ్మవారి సన్నిధిలో కాకుండా కొంత దూరంగా చేసుకొనినచో బాగుండును. అమ్మవారి చరిత్రయే గాక, అక్కడ జరుగు అభివృద్ధి కార్యక్రమములు కూడా కొన్ని తెలుపవలసినదిగా కోరియున్నాను. (ఈ పుస్తకానికి కొంత ఆర్థిక సహాయం చేశారు.) పాత జ్ఞాపకాలు మరుగునపడి పోకుండా ముందుతరాలవారికి యీ పుస్తకం కొంతవరకు ఉపయోగపడగలదు. ఈ విషయంలో మిమ్ము అభినందిస్తున్నాను.

(Sd) **డా॥ వెంకటేశ్వరరావు**



"కవిని గన్న తల్లి గర్భంబు ధన్యంబు
కృతిని పొందువాడు మృతుడు కాడు"

**బెజవాడ వెంకటేశ్వర్లు**

విజయవాడ టుబాకో ఎంటర్‌ప్రైజెస్ అధినేత
టంగుటూరు

వీరు పూనాటి మందయ్య, పార్వతమ్మలకు పుత్రుడై వెలుగొంద చుండెను. చిన్నతనం నుండి స్నేహితులన్నా, సాహిత్య,కళారంగములన్నా మిన్నగా సహాయ సహకారములు అందించువాడు.

వీరికి పొగాకు వ్యాపారములో అనుభవము కలుగుటచేత ఎందరికో జీవాధారము కలిగించుచున్నారు.

పేద విద్యార్థులకు సహాయమందించుటయేగాక, గుడికి, బడికి ఆర్థిక సహాయము అందించుచున్నారు.

అడిగిన వెంటనే శ్రీ వల్లూరమ్మ చరిత్ర పుస్తక ప్రచురణకు కొంత ఆర్థిక సహామందించిన ఉదారులు.

విద్యాదాత, వితరణశీలి, ప్రముఖ వ్యాపారవేత్త, ఈ వల్లూరమ్మ దేవాలయ అభివృద్ధి కార్యక్రమములలో కృషి చేయుచున్న మంత్రివర్యులు శ్రీ. దామచర్ల ఆంజనేయులుకూడా యీ పుస్తక ప్రచురణకు కొంత ఆర్థిక సహాయం చేయుటకు అంగీకరించియున్నారు.

"ఆదిపరాశక్తి అందరిని కాపాడుగాక"

# శ్రీ వల్లూరమ్మ చరిత్ర - మహిమలు
## (ఉల్కాముఖి)

"సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధకే
చరణ్యే త్రియాంబకె గౌరి నారాయణీ నమోస్తుతే॥

**ఊరు పేరు-వచ్చిన తీరు -:** మానవ ప్రపంచంలో మనకు పేరులేని ఊరుగాని, వస్తువుగాని, మనిషిగాని సహజంగా వుండదు. మానవ మనుగడకు యీ పేర్లు ముఖ్యాధారములు. ఒక మనిషిని మరొక మనిషి పిలవాలంటే పేరుండాలి. అలాగే ప్రతి ఊరుకి ఒక పేరు తప్పనిసరిగా ఉండాలి. ఆ పేరు వచ్చినతీరు మనకు తెలిసిఉండుట మంచిది.

ఒక శక్తికిగాని, వ్యక్తికిగాని, కులానికిగాని స్థలానికిగాని ఏదో ఒక పేరు పెట్టడమనేది మన తాత ముత్తాతల దగ్గరనుండి వినిపిస్తున్న ఆచారము. తెలుగువారి ఇంటిపేరులు గమనించినచో, కొన్ని ఇంటిపేరులు గ్రామనామములుగాను, కొన్ని గ్రామ నామములు ఇంటిపేరులుగాను వ్యవహరించినటుల తెలియుచున్నది. ఉదా॥కు వావిళ్ళ వారి నిఘంటువు ప్రథమ సంపుటం, పుట 290లో "ఊరిపేరింటి పేరుగానొప్పు నాకు అని ఉంది." పూర్వపు ప్రజల ఆచార వ్యవహారముల, వృత్తి ప్రవృత్తుల, నైసర్గిక, చారిత్రక, కుల, మత సంబంధమైన సామాజిక పరిస్థితులనుబట్టి కూడ గ్రామ నామములు ఏర్పడినవి.

పూర్వపు ప్రజలు ఏయే ప్రాంతములలో నివశించేవారో, తర్వాత కాలానుగుణముగా ఏయే ప్రాంతములకు వలస వెళ్ళినారో, ఏయే గ్రామ నామములతో పిలువబడినారో కొన్ని శాసనాధారముల ద్వారా కూడ తెలియుచున్నవి. ఇలా వంశమునుబట్టి, స్థలమునుబట్టి, కులమునుబట్టి, భాషనుబట్టి, వ్యక్తినిబట్టి, వృక్ష జంతు సంబంధంగా, దేవతపరంగా, సంఘటనలనుబట్టి, భూమినిబట్టి, బిరుదములవలన పరిపాలనా నిర్వహణనను బట్టి, వృత్తి-ప్రవృత్తులబట్టి, పాళెగాండ్రను బట్టి, ఆహార వ్యవహారములను బట్టి అనేక గ్రామనామములు ఏర్పడినట్లు చారిత్రకాధారములు గలవు.

ఉదా॥కు ఊరు, వాడ, పల్లె, పాళెం, పాడు, పట్నం, పురం, కొలను, కోట, కుండ, కొండ, కోన, తదితర సంబంధమైన పదములు

వందల వేలసంఖ్యలో గ్రామనామములుగా ఏర్పడినవి. అయితే కొన్ని సమయములందు వరదలు, తుఫానులు, భూకంపములు వలనను, రాజుల దండయాత్రల వలనను, దారిదోపిడీల వలనను పలుగ్రామాలు పాడుపడి పోయి జనసంచారము లేక బీడులుగా, ఎడారులుగా మారిన సంఘటనలు కూడా గలవు. అక్కడగల గ్రామనామం గలవారు మరొకచోటకు వలస వెళ్ళుట, ఆ గ్రామనామం మరుగున పడిపోవుట, వెళ్ళినచోట బలం కలిగినవారు వంశనామంతో గడ్డఎత్తి గ్రామనామంగా పిలువబడుచుండుట జరిగినదిగా చరిత్రలో తెలియుచున్నది.

ఈ ఊరులోని పర్యాయములే వల్లూరు, పెఋర్రు, నెల్లూరు, కల్లూరు, పావులూరు, పలుకూరు, గుంటూరు మొ॥ (2) బెజవాడ, గుడివాడ, చెదలవాడ, (3) గుండ్లపల్లి, వెలంపల్లి, (4) రాచవారి పాళెం, నాగన్నపాళెం, బసవన్నపాళెం, (5) మద్దిపాడు, నందిపాడు, ఏడుగుడులపాడు, (6) చెన్నప్పపట్నం, రామాయపట్నం, విశాఖపట్నం.

ఈ విధంగా పల్లవ, చోళ, కాకతీయుల కాలం నుండి నాటి బ్రిటిష పరిపాలకుల వరకు అనేక గ్రామ నామములు ఏర్పడటం, కొన్ని మరుగున పడిపోవడం జరిగింది. పరిస్థితుల ప్రభావమునుబట్టి మరికొన్ని గ్రామములు స్థిరముగా నేటికి నిలిచి ఉన్నవి. ఆం. ప్ర. లో కడప తదితర ప్రాంతములలో సర్వేయర్‌గా ఉండిన కల్నల్ కాలిన్ మెకంజీదొర (1754-1821) నాలుగు భాషలు తెలిసిన కావలి బొర్రయ్య (1770-1803) వారి సోదరులు, రామస్వామి, వెంకటస్వామి, నారాయణరావు తదితరుల ద్వారా గ్రామనామములు ఏర్పడిన విధము సేకరించి, శాసనములను పరిశీలించి, పరిశోధించి, వందల వేల సంఖ్యలో గ్రామకైఫియతులు వ్రాయించి, తెలుగు ప్రజలకు మహోపకారము చేశారు. తెలుగు భాషా సాహిత్యములకు నిరంతరం కృషిచేసి సి. పి. బ్రౌన్ (1790-1884) ఆంధ్రులకు చిరస్థాయిగా నిలిచాడు. ఈ గ్రామ కైఫియత్‌లు మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో అక్షరక్రమములో 70 వాల్యూమ్స్ దాక గలవు. అవి పరిశీలించినచో మన గ్రామనామములు ఏర్పడిన విధము

తెలియగలదు. ప్రస్తుతం ఒంగోలు మంగమ్మ కళాశాలలో పనిచేయుచున్న శ్రీ పి. నాగమల్లేశ్వరరావుకూడా గ్రామనామములు- ఏర్పడిన తీరుపై చక్కటి సిద్ధాంత గ్రంథమును తయారు చేశారుకూడ.

**పల్లూరు:** గ్రామ పూర్వనామము "పాములపాటి". ముస్లీముల దండయాత్ర వలన నిరాదరణకు గురి అయినదని కొందరి పూర్వీకులు చెప్పుకొనుట జరిగినది. ఈ పాటిమీద పాములు, తేళ్ళు జెర్రులు, మండ్రగబ్బలు తదితర సంబంధమైన విషపురుగులు రాత్రనక పగలనక, చిల్ల చెట్లంలో, ముళ్ళపొదలలో తిరుగుచుండెడివట. అతివృష్టి అనావృష్టి వలన కూడ పంటలు సరిగా పండక,బీడులు ఎడారులుగా ఉండుటచేత జనసంచారం తక్కువగా నుండెనట.

రాజ్యపరిపాలన అంతటిని ఒక కేంద్రంగా పరిపాలించుచున్నప్పటికి, తిరుగుబాటుదారుల వలనను దారిదోపిడీల వలనను, ఎక్కడ ఏమి జరుగుచున్నది తెలియుట కొరకు పల్లవ-కాకతీయుల కాలంనుండి, అక్కడక్కడ సామంతరాజులను, మహామండలాదీశులను, మండలేశ్వరులను నియమించి, వారివద్ద ప్రధానమంత్రులుగా, సేనానాయకులుగా, ముఖ్య సలహాదారులుగా, గ్రామ పరిపాలనా వ్యవహారములు, అంతరంగిక విషయములు తెలుపుటకు వేద ఆగమశాస్త్ర పండితులను, గ్రామ పెద్దలను నియమించారు. వారికి అగ్రహారములు ఇచ్చి తమ ఆదీనములో కార్యనిర్వహకులుగా ఉంచబడినారు.

వీరు చేయుచున్న పదవులనుబట్టి రాజు తర్వాత రాజు అంతటి గౌరవమును ప్రజలచేత పొందుచుండెడివారు. మండలాదీశులు వారిపై నమ్మకంతో గ్రామ అంతరంగిక వ్యవహారములు, పన్నులు, ఇతర అభివృద్ధి పనులు వారిద్వారా ఎప్పటికప్పుడు తెలుసుకొనుచు, ఆయా గ్రామాలకు తగిన విధముగా సహాయ సహకారములు అందించుచుందురు. వీరు రాజుల మెప్పించి, ఒప్పించి, అగ్రహారములు ఆదిపత్యము, బిరుదములు పొందుచుండిన సంఘటనలుకూడ గలవు.

గ్రామ వ్యవహారములలో, పరిపాలనా నిర్వహణలోను కొందరిని రాజులు నియమించుటచేత నియోగులైనారు. ఆగమశాస్త్రాది విషయములు

తెలిసియుండి, పురాణాది విషయములు చెప్పబడుటచేత కొందరు వైదికులుగా వ్యవహరింపబడు చుండిరి. అట్టివారలకు అగ్రహారములు ఇచ్చి గ్రామ కరణీకులుగాను, ముఖ్య సలహాదారులుగా పెత్తనము చేయచుండెడివారు. అట్టివారిలో పల్లవులు, కాకతీయుల కాలంనుండి వల్లూరు వంశజులు యీ పాటిమీద అగ్రహారీకులుగా నియమించారని పూర్వీకులు చెప్పుకొనుచున్నారు. వీరికి వసతులు కూడా కల్పించారట. వీరు ఆర్వేల నియోగులు. వీరు గ్రామాలలో, పరిసర ప్రాంతాలలో జరుగు ముఖ్య విషయములను పైవారికి తెలియజేయుట, పన్నులు వసూలుచేసి, జమచేయుట, ప్రజలకు పైవారి సూచనలు, సలహాలు తెలియజేయుట, ఈతిబాధలు, ఇతర గ్రామ సమస్యలు వచ్చినప్పుడు పైవారితో సంప్రదించి నివారించుటకు కృషి చేయుట సర్వసాధారణమై, యీ పాములపాటిమీద అగ్రహారీకులై నివశించుటచేత వల్లూరు అగ్రహారీకులుగా వ్యవహరించుట జరిగింది. దానికి ఆధారములు గుడిగోపురములే.

**(1) సోమశేఖరుడు - పర్వతవర్థనమ్మ :** సూరారెడ్డిపాలెం వల్లూరు నివాసులు యీ పరిసర ప్రాంతములలో గేదెలను కాచుకొనుచు, అవసరమైనప్పుడు ఇళ్ళకు వాకిళ్ళకు మట్టిని త్రవ్వుకొనుచుండును. అట్టిపరిస్థితులలో సోమంద (కలబంద) పొదలలో శిల దొరకుటచేత, దానిని పరిశీలించిన పెద్దలు సోమశేఖరుడుగా నిర్ణయించి, దొరికినచోట చిన్నదేవాలయం నిర్మించి, దానిలో సోమశేఖర-పర్వతవర్థనమ్మలను ప్రతిష్టించి, పూజలు చేస్తున్నట్లు శ్రీ చివుకుల నారాయణ తన తాతముత్తాతల కాలం నుండి చెప్పుకొనుచున్నాడని చెప్పుట జరిగింది. కాకతీయులు, విజయనగరరాజులు, కొండవీటి రెడ్లవరకు కూడా యీ దేవాలయం పూజలు, తిరునాళ్ళ కార్యక్రమములు జరుగుచుండేవని పెద్దలు చెప్పుకొనుచుండిరి. వెంకటగిరి రాజుల కాలంలో కూడా 35-40 ఎకరముల పొలం కూడా ఉన్నదని తెలుస్తుంది. బోదానంద సూత్రము కాశ్యప సగోత్రీయులు త్రయాఋషి వంశీయులు మొదటనుండి అర్చకత్వం గలదు. ప్రస్తుతం యీ దేవాలయమును పునర్నిర్మాణము చేయుచున్నారు. బద్దెపూడి కృష్ణ అర్చకత్వం చేయుచున్నారు.

**(2) రుక్మిణి - సత్యభామసమేత శ్రీ వేణుగోపాల స్వామి :** ఈ దేవాలయం విజయనగర రాజుల ఏలుబడినాటికే ఉన్నదని కొందరు పూర్వీకులు చెప్పకొనుచుండుట తెలుస్తుంది. శ్రీ వెంకటగిరి రాజుల కాలంనాటికి 37 ఎ. 75 సెం. పొలం ఈ దేవుని పూజాది కార్యము లకు యిచ్చినట్లు చరిత్ర కాధారములు కన్పిస్తున్నాయి. అప్పటి రాజరికము సహకారముతో గుడి నిర్మాణం జరిగింది. టంగుటూరి కోదండరామయ్య చుట్టు ప్రహరీగోడలు నిర్మించారు. టంగుటూరి రామదాసుగారు స్వామి కార్యక్రమములకు వచ్చువారికి సత్రము నిర్మించారు. ఈ వంశంలోని వారు ఆర్వేల నియోగులేకాదు కరణీకులు కూడా వీరివంశంలోని శ్రీ గోపాలకృష్ణమూర్తి (నెల్లూరు) నేటికి దీనికి ట్రస్టీగానుండి, కొంత సహాయ సహకారములు అందించుచున్నారు. 1931 తర్వాత స్వామివారి బ్రహ్మో త్సవములు భారీగా జరుగుటలేదని తెలుస్తుంది. గుడి ఉత్సవములు పూజాది కార్యక్రమములు వైఖానస పద్ధతి ప్రకారం మాత్రం ఆనవాయితీగా శ్రీ దివి వంశజులు నేటికి నిర్వహించుచున్నారు. వీరిలో మొదట దివి వెంకట నర సింహాచార్యులు, దివి రామానుజాచార్యులు, వెంకటాచార్యులు, హనుమాజా చార్యులు, వారి కుమారులు చెంచమాచార్యులు ప్రధాన అర్చకత్వం వహిస్తూ, నేటికి పొలంలో పండే పంటద్వారా జీవనము సాగించుచున్నారు. ఎండోమెంటు వారిద్వారా ఇతర స్వామికార్యములు నిర్వహించుచున్నారు. సంక్రాంతి కనుమ పండుగరోజు సాయంత్రం ఆనందోత్సాహములతో వల్లూరు చెఱువులో తెప్పోత్సవం బ్రహ్మాండంగా జరుగుచుండును. పరిసర ప్రాంతములవారు భక్తి పారవశ్యంతో కన్నుల పండుగలో తెప్పోత్సవ మును తిలకించుచుందురు.

**3) కులములు** : కాకతీయుల, విజయనగర రాజుల, గజ పతుల, రెడ్డిరాజుల, మహమ్మదీయుల పరిపాలనా కాలంలో యీ వల్లూరు-పెళ్ళూరు పరిసర గ్రామాలలో నివసించుట జరిగిందని చెప్పట తెలుస్తుంది ఈ వల్లూరులో (వల్లూరు ప్రస్తుతం లేదు) అద్దంకివారు, భాగవతులవారు, పరాంకుశంవారు, దివివారు, టంగుటూరివారు, పోలూరివారు, చిపుకుల వారు, పిల్లుట్లవారు, పచ్చవ మొ॥ 21 నియోగ కుటుంబములవారు, 9

వైదిక కుటుంబములవారు గలరట. వీరుగాక 14 రెడ్ల కుటుంబాలు, 31 గొల్ల కుటుంబాలు, 5 మరాటి, 9 చాకలి కుటుంబాలు, 9 మంగలి కుటుంబాలు, 7 జంగములు, 4 వడియరాజులు, 15 దూదేకుల, 3 విశ్వబ్రాహ్మణ బలిజలు, మాదిగలు కలిసి మొత్తం 196 కుటుంబాలవారు ఉన్నట్లు తెలుస్తుంది. వీరందరు గ్రామ పెద్దల, పెత్తందారుల సలహా మేరకు వారివారి వృత్తి ధర్మాలను అనుసరించి జీవనము సాగించుచుండెడివారుట. అన్నదమ్ములవలె కలసిమెలసి జీవించినవారు.

**4) చెఱువులు-కుంటలు :** కాకతీయులు, విజయనగరరాజులు గజపతులు, రెడ్డిరాజుల కాలం నాటికే వల్లూరు- పెఘ్నారు చెరువులు ఉన్నట్లు తెలియుచున్నది. ఈ చెరువులు వర్షముల వలన నిండితే పంటకు పాడికి కరువు లేకుండా ఉండేవట. ఈ చెరువులు రెండు రామలక్ష్మణుల్లా అన్నదమ్ములవలె ఉండెడివట. వర్షములు లేక చెఱువులకు నీళ్ళు రాక ప్రజలకు తిండికి నీటికి కరువు ఏర్పడినప్పుడు, నాటి గ్రామపెద్దలు రాజులతో సంప్రదించి తగిన విధముగా మరమ్మత్తులు చేయించెడివారట. హరిహరరాయలు, బుక్కరాయల కాలంలో పూడికతీసి గట్టు పోయించుట జరిగిందట. అంతేకాదు అక్క డక్కడా అద్దంకివారు, చివుకులవారి, పిల్లుట్లవారి కుంటలు గలవు. చెఱువు తూముల ద్వారా యీ కుంటలకు కూడా నీటిసరఫరా జరుగుచుండేదట. పండగలకు, తిరనాళ్ళకు పనిపాటలు చేసుకొనువారికి లేదనకుండా పెట్టుపోతలలో దండిగా వడ్డించెడివారట. కూటికి గుడ్డకు కరువు లేకుండా పంటలు సమృద్ధిగా గాదెలు నిండేవట. ప్రజలు కూడా గౌరవ మర్యాదలతో జీవనము సాగించుచుండెడి వారట.

**కాలదోషం :** విజయనగర రాజుల పతనానంతరము కొంతకాలం మహమ్మదీయుల పరిపాలన సాగింది. అక్కడక్కడ రెడ్డిరాజులు, గజపతులు పరిపాలన సాగించుచుండిరి. స్వార్థం పెరిగి అంతఃకలహములు ఆరంభమయ్యెను. ఫ్రెంచివారు, ఆంగ్లేయులు వ్యాపార నిమిత్తం వచ్చి తగాదాలకు కారకులు-ప్రేరకులు కాజొచ్చెను. అందువలన సామంత రాజులు, దండనాయకులు, పాళెగాండ్రు బలంకలిగినవారు స్వతంత్రులై అక్కడక్కడ చిన్న చిన్న రాజ్యములను ఏర్పాటు చేసుకొని, నిర్వహణ

సాగించుచుండిరి. ఎవరికివారే తమ అధికారము క్రింద గలవారిని లోబరచుకొని, గజపతులకు, మహమ్మదీయులకు లోబడి కప్పము చెల్లించు లాగున, వారి ఆధీనంలో స్వతంత్రంగా జీవింపసాగిరి. అట్టివారిలో 16వ శ.లో మందపాటి రాజులు ఒకరు.

**మందపాటి రాజులు** : ఒంగోలు పరిసర ప్రాంతంలో స్వతంత్రించినవారు, అరాచక పరిస్థితులలో నిజాం, కర్నాటక నవాబు లకు లోబడి వారి పెత్తనముపై సామంత రాజులుగా పరిపాలన సాగించు టకు సహాయసహకారములు పొందుచున్నారు.

1605లో మొదట అయ్యపరాజు కొణిజేడు, వక్కూరు, పేర్లమిట్ట మంగమూరు ప్రాంతములకు సామంతరాజుగా నియమించుట. వీరు జాగ్రత్తగా శిస్తు వసూలుచేస్తూ, కొంత నవాబులకు చెల్లించి, మిగతా మొత్తం శాంతిభద్రతలకు, గ్రామ పరిపాలనకు వినియోగించుట జరి గింది. 25 సం॥లు పరిపాలించిన తర్వాత వీరి కుమారులు మూర్తిరాజు, లింగరాజు 1630లో పరిపాలనకు వచ్చారు. వీరు నవాబుల ఆధీనంలో కొంతకాలం పరిపాలన సాగించారు.

1700లో పరిపాలనకు వచ్చిన రఘుపతిరాజు రాజుపాలెం, గంగ వరంతోబాటు ఒంగోలు (తా) మొత్తం వీరి ఆదీనంలోకి వచ్చింది. అందు వలన కొణిజేడు నుండి ఒంగోలు కేంద్రంగా వచ్చి, 1706లో కొండకు ఉత్తరంగా బలిష్టమైన కోటను నిర్మించాడు. వీరు పరిపాలించుచున్నప్పుడు రామభద్రరాజు పెళ్ళూరు తదితర ఒంగోలుకు దక్షిణ పడమర గ్రామాలు రామచంద్రరాజు ఒంగోలుకు తూర్పు ఉత్తర గ్రామాలు ఏలుబడిలోకి తెచ్చుకొనుట జరిగింది. వీరిద్దరు అన్నదమ్ములు. తెలివితేటలకు, సాహ సమునకు పట్టుకొమ్మలు. వీరిలో రామచంద్రరాజు నవాబుల కోరికపై కొన్ని సాహసకార్యములు చేయుటచేత మెచ్చి, సరిగా కప్పం చెల్లించుట లేదనే నెపముతో వెంకటగిరివారి ఆదీనంలో గల పాదర్తి మొదలు ఆరు సముద్రతీర ప్రాంతములను కూడా స్వాదీనం చేసుకొని పరిపాలించుట జరిగింది. మరికొన్ని సాహసకార్యములు చేసి, అద్దంకి, ఇనమనమెళ్ళూరు, పర్చూరు గ్రామాలు పొందగలిగారు. రామచంద్రరాజు ధైర్యసాహసం

గలవారు.

ఆ రోజులలో బలవంతులు, ధైర్యవంతులు, బలహీనులపై దండెత్తి గ్రామాలను స్వాదీనం చేసుకొనుట, సిరిసంపదలను దోచుకొనుట జరుగు చుండేది. దాని వలన మండలాదీశులకు, ప్రజలకు కష్టము నష్టములు కలుగుచుండెడిది. ఇది గమనించిన రామభద్రరాజు పెఘ్నారులో కూడా కోటను నిర్మించి, జనరంజకముగా పరిపాలన సాగించారు. వీరు గోల్కొండ, హైదరాబాదు నవాబులకు, కర్నాటక ప్రభువులకు సకాల ములో పన్నులు వసూలు చేయుట సక్రమముగా వారికందించుట జరుగు చున్నది. నవాబులు జరుపు సభలకు రాచకార్యములకు ఆయా మండల ముల నుండి ఒకరిద్దరు పోవుచుండెడివారు. ప్రజల సమస్యలను ప్రభువు లకు తెలియజేయుట, ప్రభువుల ఉత్తర్వులు అమలుచేయుటలో మందపాటి వారు కడు తెలివికలిగి వ్యవహరించుటచేత పైవారికి అనుకూలముగా యుండిరి. ఒక్కొక్కసారి నవాబులు ఆదేశించిన సాహసోపేతములైన భయంకర పనులను ధైర్యంచేసి, వారి ద్వారా బిరుదములను, బహుమాన ములను పొందుచుండిరి.

అట్టి సందర్భంలో చీమకుర్తికొండ పరిసరప్రాంతం అడవులలో ఒక భయంకరమైన పులిని చంపుటకు సాహసకులైన సంస్థానాదీశులకు పర్మానా విధించారు. దానికి రామచంద్రరాజు అంగీకరించి, ఒక ప్రక్క సైన్యాధిపతులను చూస్తుండమని, మరొకప్రక్క మాటువేసి, చాకచక్య ముగా వెంటాడి పులిని చంపాడు. ప్రజలకు గల భయాందోళనమును తొలగించాడు. ప్రజలు రామచంద్రరాజు ధైర్యసాహసములకు మెచ్చు కున్నారు. గోల్కొండ నవాబు వీరిని పిలిపించి "దేశపాండ్య" బిరుదునిచ్చి సత్కరించారు. అతడి ధైర్యసాహసములకు పై ప్రాంతాన్ని అప్ప గించారు.

తెట్టు ప్రభువు వేజెళ్ళ వెంకటనారాయణరాజు వీరికి మేనమామ అయినందున తన కుమార్తె అచ్చమాంబాదేవినిచ్చి వివాహంచేసిన విషయం అక్కరాజు నరసింహారావు వ్రాసిన శ్రీ రామచంద్ర విజయంలో గలదు. ఈమెకూడ వీరవనిత. అంతేకాదు నిజాం పరిపాలనా కాలంలో అలవికాని

మదపుటేనుగును వశపరచుకొనుటకు రామచంద్రరాజు హైదరాబాదు చేరుట, అక్కడ కొంతమంది సైన్యాలకు ప్రగుడ్డలు వేయించి, బెదిరిన మదపుటేనుగులను నలుదిక్కులకు పరుగెత్తించి, అలసట చెందిన తర్వాత తన బుద్ధిబలముతో చాకచక్యముగా వశము పరచుకొని, దాని మదమణి గించి, వారం రోజులకల్లా రాజునకు అప్పగించుట విశేషమని చెప్పాలి. ఈ కార్యమునకు నిజాం సంస్థానంలోని ముఖ్యులందరు ఆశ్చర్యపడుటయే గాక, నవాబుగారి ద్వారా "కలియుగ భీముడన్న" బిరుదము ఒసంగి కాను కలతో సత్కరించి పంపుట జరిగింది.

అలాగే తన మేనమామ సంస్థానం తెట్టు గుడ్లూరు పరిసర ప్రాంత ములో గల భయంకరమైన పులిని చంపి, అక్కడ ప్రజలచేత గౌరవ మర్యాదలు పొందుట జరిగింది. 1728లో రామచంద్రరాజు ఒంగోలు కొండమీద శ్రీ చెన్నకేశవస్వామి దేవాలయం నిర్మించాడట. వీరి దగ్గర చురుకుగా పనిచేయుచున్న తెలివిగల మంత్రివర్యులు వంకాలపాటి వీరన్న దాని ప్రక్కన కాశీ విశ్వేశ్వరాలయమును నిర్మించెను. విశేష వైభవముతో ప్రజాభీష్టం ప్రకారం పౌరుషవంతులై రాజ్యపాలన చేయుట, వెంకటగిరి రాజులకు తలనొప్పిగాను, ప్రక్కలో బల్లెంవలె బద్ధవిరోదము కలిగి యుండెను. అంతేకాదు నిజాం నవాబు కర్నాటక ప్రభువుల దగ్గర కొంత సహాయసహకారములు పొందికూడ వీరికి పుండుమీద కారం చల్లినట్లుండి, అవకాశం దొరికినప్పుడల్లా ఘర్షణలు పెట్టుకొనుచుండెను. యుద్ధము చేయుటకు సిద్ధంగా నుండెను.

"వంగోల్ రాజ్యలక్ష్మితో వాసికెక్క" కలి
యుగ భీమబలుడన శూరత వెలసినట్టి
మందపాటి కులాబ్ధి సాహసోపేతుడై
రామచంద్రుడనే రాజుండు రహిజెలంగ॥

అని కొంత వెనుక ముందు ఆలోచనలో కూడా వెంకటగిరివారు ఉపేక్షించుచున్నారట. ప్రతిభావంతులుగాను, గుణశీలములలో యశస్సు కలిగి, విశేష అనుభవముతో ఒకరికి తలవంచని వీరులు, శూరులు మంద పాటివారు.

**వెంకటగిరి సంస్థానము-వెలుగోటి వంశజులు :** విజయ నగర రాజుల పతనానంతరము, రాజ్యవ్యాప్తికై పోరాడి స్వతంత్రించిన సంస్థానములలో వెంకటగిరి రేచర్ల వెలమ నాయకులు ఒకరు. వెలుగోటి వంశజులు వెంకటగిరి ప్రభువులు బంగారు యాచమనాయనింగారు. ధైర్య సాహసములు గలవారు. భాషాభిమానం గల పండిత కుటుంబం కూడా. ఆర్థికంగా అంగబలంలో ఇతర సంస్థానములకన్నా ఎక్కువ అవకాశం ఉన్నవారు. వీరికి కావేరి సమీప పాలకులు దామచర్లవారు కూడా బంధువులే. వీరు కంచినుండి కాళహస్తి వరకు అక్కడక్కడ పరిపాలన చేయుచుండిరి.

వర్తక వ్యాపారములతో వచ్చిన తెల్లవారు మనలో మనకు తగువులు పెట్టి, యుద్ధములు చేయించి, ఒకరిపై ఒకరికి ద్వేషములు కలుగునట్లు చేయుచుండిరి. పట్టుదలకు మారుపేరు వెంకటగిరివారు. తెలుగువారి, నవాబుల దయవలన ఇంగ్లీషువారు పలుచోట్ల కోటలు కట్టి, ఫిరంగులు నిలిపారు. ఒక ఫిరంగి ప్రేలితే దాని గుండు ఒకటి వెళ్ళి వెంకటగిరి సంస్థానము ఏలుబడిలో పడింది. అక్కడకూడా కోట నిర్మించాలని ఇంగ్లీషువారు వెంకటగిరిరాజాలతో మంతనములు చేశారు. దానికి బంగారు నాయనింగారు ఒప్పుకొనలేదు. ఆర్థికంగాను అంగబలం కలిగిన వెంకటగిరివారిని ఏమీ చేయలేక ఇంగ్లీషువారు తటస్తముగా నుండిరి. పైగా చురుకుతనం ధైర్యసాహములు బుద్ధికుశలత కలిగినవారు. వెంకటగిరి రాజులకు, మందపాటి రాజుల సంస్థానము పరిసరప్రాంతములలోకూడా కొన్ని గ్రామాలు ఏలుబడిలో గలవు. వీరుకూడా విజాపూర్ కర్నాటక ప్రభువుల వద్ద అధికారం కలిగి, ఆయా గ్రామాలతో పెత్తనము చేయుటలో ముందంజలోనుండిరి. బ్రిటిషువారి ద్వారాకూడా "సర్, బహదూర్, మునసబ్‌దార్" తదితర బిరుదములు పొంది, పరాయి రాజులకు పక్కలో బల్లెమువలె సింహస్వప్నంగా మెలుగుచుండిరి. మోచెర్ల వెంకనమాదిత్యుడు, గోపీనాథ వెంకటకవివలన మనకు కొన్ని ఆధారములు వెంకటగిరి సంస్థానము వెలుగోటి వంశ చరిత్రలో కన్పించగలవు.

**1. ఒక వరలో రెండు కత్తులు ఇమడవు:-** ఆర్థిక బలము'

అంగబలముగల వెంకటగిరి రాజులకు, ధైర్య సాహసోపేతములుగల పెళ్లూరు, పెద్దూరు, ఒంగోలు మందపాటి రాజులకు మొదటినుండి గిట్టదు. రామభద్రరాజు-రామచంద్రరాజు పరిపాలనకు వచ్చినతర్వాత ఇరు సంస్థానములకు వైరము ఎక్కువై, ఏదో సమయములో తగాదాలు, కొట్లాటలు ఇరువర్గాల సైన్యమునకు జరుగుచుండెను. దీనికి కానివారు కొందరు (ఇంగ్లీషువారు) కావాలని మరికొందరు కొండిగములు చెప్పుచు, అంతః కలహములు పెట్టి యుద్ధమునకు సిద్ధము చేయుచుండిరి. దానివలన జన నష్టము ధననష్టము కరువు కాటకములు ఏర్పడుచుండెను.

ఒకసారి మందపాటి రాజు సోదరులు తమకు రావలసిన కప్పమును (పన్ను) చెల్లించవలసినదిగా తమ ఆంతరంగిక ఉద్యోగి గువ్వల తిరువెంగళాన్ని వెంకటగిరికి పంపగా వెంకటగిరిరాజావారు "బలహీనులకు బోడి పెత్తనమా" అంటూ వచ్చినవాడి తల నరికి, తన సైన్యాధికారిలో ఒకరిని మందపాటి రాజులవద్దకు తలను బహుమానంగా పంపించారు. ఒంగోలు రాజులకు ఇది అవమానంగా తలంచెను.

తన ఉద్యోగి తలనరికి తనవారి సంస్థానమునకు బహుమానముగా పంపినందుకు కలతచెంది దేశపాండ్య కలియుగభీముడనే బిరుదములు కలిగిన రామచంద్రరాజు వెంకటగిరిరాజావారికి గుణపాఠం తెల్పేందుకు, వచ్చిన వెంకటగిరి సైన్యాధకారి మెడలో, బలమైన దృఢమైన ఇనుప గడ్డపలుగును మెలివేసి, "మీ రాజు మొనగాడైతే, ఈ గడ్డపలుగు మెలికలుతీసి పంపమనీ లేక బుద్ధిగా మాకు రావలసిన కప్పమును వెంటనే చెల్లించమని సవాలుగా చెప్పి తిప్పి పంపించాడు. విషయము తెలుసుకున్న వెంకటగిరిరాజావారు మెలికలు తీయలేక, పరాభవముతో ఒంగోలు రాజులపై కుట్రపన్నుచూ, యుద్ధము చేయుటకైనను సిద్ధముగానుండిరి.

**4 నల్లాగు సంఘటన :-** తెట్టు పరిసర ప్రాంతములోగల భయంకరమైన పులిని చంపుటకు తెట్టు ప్రభువు తన మేనమామ వేజళ్ళ వెంకటనారాయణరాజు వర్తమానం పంపగా రామచంద్రరాజు బయలుదేరి వస్తున్నాడని చారులవలన తెలుసుకున్న వెంకటగిరి రాజులు పెళ్లూరు దగ్గరలోగల నల్లవాగు పల్లపు ప్రాంతంలో సైన్యాన్ని అప్రమత్తంగా ఉంచారు.

విధివశాత్తు ఆ దారిన మంత్రి జానోజీ రాగా, వీరే రామచంద్రరాజని తలంచి సల్లమందులతో కాల్చి చంపారు. ఈ ఘోరం జరిగినచోటే నల్లాగుగా పిలుచుచున్నారు.

మరొక మార్గంలో పోతూ రామచంద్రరాజు పై విషయం తెలుసుకొని, మండిపడుతూ, నాయుడుపాలెం కోనేటిదగ్గర కాపుకాచి, వెంకటగిరి సైన్యాన్ని హతమార్చుట జరిగింది.

**5. దండు బాట తగాదా :-** సంస్థానముల పరిపాలన కాలములో రోడ్లుగానీ, రవాణా సౌకర్యములైన కారులుగాని లేవు. కాలిబాటలు మాత్రం ఎక్కడపడితే అక్కడమాత్రం ఎక్కువగా ఉండేవి. రాజకార్యం నిమిత్తంగాని, రవాణా కొరకుగాని బండ్లు, రథములు, ఏనుగులు, ఒంటెలు పోవుటకు విశాలమైన మట్టిబాటలు గలవు. డొంకలు గలవు. క్రోసు, ఆమడ, మరికొంతదూరం పోతే, సైన్యంగాని, బాటసారులుగాని, బండ్ల వ్యాపారులుగాని విశ్రాంతి తీసుకొనుటకు చింతతోపు, మర్రిచెట్లు, ఏర్పాటు గలదు. వాటికి దాపులో కుంట లేక చెఱువు త్రవ్వబడియుండును. త్రాగు నీటికి వీటిని ఉపయోగింతురు. వీటిని కోనేరు యనికూడా అందురు.

అధికారులు జోడు గుర్రములపై పయనిస్తూ, పదాది సైన్యము భటులు కాలినడకన దండుగా నిండుగా వెడలుచుందురు. మధ్యలో రాజు తర్వాత రాజోద్యోగులు పదాదిదళములు బయలుదేరును. దీనినే దండు బాట అందురు. దీనికి ఇరుప్రక్కల నాగజెముడు, కలబంద నాటబడియుండును. ఈ బాటలద్వారా ఏనుగులు, ఒంటెలు, గుర్రములు, ఇతర వాహనములు అనేకమంది సైన్యం బయలుదేరును.

వెంకటగిరిరాజావారి మంత్రులు, రాజోద్యోగులు సైన్యసమేతంగా యీ దండుబాటగుండా వెళ్ళి, కారంచేడు, స్వర్ణ, సంతరావూరు, చిన్నగంజాం తదితర సముద్రతీరప్రాంతాలకు వెళ్ళి, కప్పము చెల్లించుకొని తిరిగి వచ్చుచుందురు. ఆలా వస్తున్నప్పుడు పెళ్లూరు, ఎడ్లూరు సంస్థానములలోగల పంటపొలములలో పడి, గుర్రములు, ఏనుగులు, ఒంటెలు, సైన్యం, పైరులను నాశనంచేసి అపారనష్టము కలిగించారని, చారులవలన తెలుసుకొని ఆటకాయించి, "ఇదేమి పని" అని అడుగగా వెంకటగిరి

సైన్యము, జగడమునకు దిగిరి. గొడవలు కలుగజేసుకొని కొట్లాట జరిగెను. విషయము తెలుసుకున్న మందపాటి రాజులు రామభద్రరాజు రామచంద్రరాజు వెంకటగిరి సైన్యమును, గుర్రములను, ఏనుగులను, కట్టివేయించి, నష్టపరిహారముగా పైకము చెల్లించి, తనవారిని తీసుకొని పోవలసినదిగా వెంకటగిరాజు వారికి కబురు చేశారు.

ఇది వెంటగిరివారికి అవమానము పరాభవముగా తలంచి, మందపాటి రాజులకు తగిన గుణపాఠము చెప్పుటకు, యుద్ధమును ప్రకటించిరి. మందపాటి రాజులుకూడా వారిని ఎదుర్కొనుటకు తగిన ప్రయత్నములు చేయుచుండిరి. ఆంగ్లేయులు కూడా గోడమీద పిల్లిలా ఇరుపక్షముల వారికి అనుమానం రాకుండా మంతనములుచేయుచు అవకాశము దొరికినచో ఒకపక్షంవారి ద్వారా స్వప్రయోజనము పొందుటకు ఎదురుచూచుచుండిరి. ఇరువర్గముల రాజులు ఆంగ్లేయుల కపట నాటకమును గమనించి, వారికి అవకాశం లేకుండా చేయుటకు అంతరంగికులతో ఆలోచనలు చేయుచుండిరి. యుద్ధము సంభవించినచో ప్రజలకుకూడా ప్రాణనష్టం, ఆస్తి నష్టం-కష్టం కలుగునని భయపడుచుండిరి. యుద్ధము జరుగకుండా, ఉన్నత పదవులలో ఉన్నవారు ఇరుపక్షములవారికి సంధి చేయుటకు తగిన కృషి చేయుచుండిరి.

వెంకటగిరి సంస్థానము ఆర్థికముగా అంగబలము కలిగి రాజకీయంగా పేరుపొందియున్నది. మందపాటి రాజులు తెలివికలిగినవారు అయినప్పటికి ఆర్థికముగా అంగబలము తక్కువగా ఉన్నది. యుద్ధం చేయవలసివచ్చినచో శత్రువులను ఎదుర్కొనుటకు తగిన స్థోమత ఎలా అన్నది వారి ఆలోచన. యుద్ధంలో ఓడిపోయి పరాభవము, అవమానము పొందుటకంటే ఏదోఒక ఉపాయముచేత సర్దుబాటు చేసుకొనవలెనని తగిన ఆలోచన అంతరంగికులతో చేయుచున్నారు. పెళ్ళూరు, ఒంగోలు సంస్థానములకు అనుకూలురు, అంతరంగికులు, గ్రామ దేశవ్యవహారములలో ముఖ్య సలహాదారులు, మంత్రివర్యులు, ఆర్వేల నియోగులు అద్దంకివారు తదితరులు అతి ముఖ్యులు.

**అద్దంకివారు:-** వ్యవహారికులు. వీరిలో వల్లూరు నివాసి అద్దంకి

రామచంద్రయ్య ముఖ్యులు. మందపాటివారితోను, వీరన్న మంత్రివర్యుల తోను సన్నిహిత సంబంధం కలిగినవారు. దేవి ఉపాసకులు. భూతప్రేత పిశాచగణముల బారినుండి కాపాడగలిగినవారు. ఆత్మస్థయిర్యము, తెలివి తేటలు కలిగి రాజకార్యములను చాకచక్యముగా పరిష్కరించగల నేర్పు కలిగినవారు. అవసరమైతే అగ్నిగుండమునుండి అమ్మను (దేవిని) ప్రసన్నము చేసుకొని, చీడపీడలు రాకండా కాపాడగల మంత్రతత్పరులు.

**రామచంద్రయ్య సలహా:-** మందపాటి రాజుల వలన వెంకటగిరివారి కుట్ర కుతంత్రములు తెలుసుకున్న అద్దంకి రామచంద్రయ్య ఆలోచించి, పెద్దారు రాజులకు చక్కటి సలహా చెప్పారు. యుద్ధము జరిగినచో దానిని ఎదుర్కొనుటకు శక్తిసామర్థ్యములు, సైన్యసహకారము అవసరము. ప్రస్తుతం అవి మనకు తక్కువగా ఉన్నవి. వారు మనలను మట్టుపెట్టి పెత్తనము చలాయించవలెనని తలంచుచున్నారు.

**శక్తి—యుక్తి :** మనకు సైన్యం తక్కువ. ఆర్థికంగా కూడా వారితో తలబడుటకు బలం చాలనప్పుడు మానవశక్తి ద్వారా "మహాయజ్ఞం చేసి" మంత్ర తంత్రములతో అమ్మవారిని ప్రసన్నము చేసుకొని, దేవి సంకల్పముతో ఎదుటి వారిని త్రిప్పి కొట్టుటకు ప్రయత్నం చేయవలసి యున్నది. దాని వలన యుద్ధము ఆగిపోవుటయేగాక, ప్రజలకు నష్టము-కష్టము కలుగకుండా పోతుంది. ఏ పని చెయ్యాలన్న శక్తి అవసరం కదా. శక్తి స్వరూపం ద్వారా కొంత విజయం సాధించుకొనవచ్చు. లేదా ఇతర రాజుల ఆశ్రయించి తగిన సైన్య సహకారము, ఆర్థిక బలము పొందవలసియున్నది. తద్వారా కూడా వెంకటగిరి వారిని ఎదుర్కొనుటకు అవకాసము గలదు. ఈ రెంటిలో ఏదో ఒకటి ప్రస్తుతము మనకు అవసరము. యజ్ఞమునకు తగిన బ్రహ్మజ్ఞాని, దేవి ప్రసన్నులు, మంత్రతంత్ర విద్యలు తెలిసినవారు, యోగీంద్రులవారు ఉన్నారు. మీరు సరే నంటే వారితో సంప్రదించి తగిన సహాయ సహకారములు పొందగలము. అంతకు మించిన ఉత్తమమార్గం మరొకటి లేదన్నారు. యుద్ధమునకు అన్ని విధముల నష్టము.

అద్దంకి రామచంద్రయ్య సలహాలను, సూచనలను మందపాటి

రాజులు విన్నారు. సావధానముగా ఆలోచించారు. అంగబలము, ఆర్థిక బలము చాలనందున ప్రస్తుతం యీ ఆపద నుండి తప్పించుకొనుటకు యజ్ఞం చేయించుటయే తగిన విధానమని తలంచారు. శక్తి స్వరూపం ఆగమనంద్వారా యుద్ధం ఆగిపోతే అంతకన్న కావలసిన దేమున్నదని, నిర్ణయించుకున్నారు. ఈ కార్యక్రమమునకు కావలసిన సకల సదుపాయములు సమకూర్చుకొనుటకు తగిన ఏర్పాటు చేయించమన్నారు.

**శ్రీ శ్రీ శ్రీ బరూరి నరసింహ యోగీంద్రులవారు :** శ్రీ అద్దంకి రామచంద్రయ్య వెంటనే తనకు ముఖ్యులు, గురుతుల్యులు, వైదిక శ్రేష్ఠుడు, దైవజ్ఞుడు, దేవి ఉపాసకులు, సకల వేద శాస్త్రకోవిదుడు మంత్ర-తంత్ర విద్యా విశారదుడు, శక్తి స్వరూపిణిని అష్టబంధనము చేత ఆపగల ధైర్యశాలి, భయంకరమైన క్షుద్ర శక్తులను సైతము బాపోష నముద్వారా ఆపగల శక్తివంతుడు, తనకు చిరకాల మిత్రుడు, శ్రీ శ్రీ శ్రీ బరూరి నరసింహ యోగీంద్రుల వారిని కలసి విషయము తెలిపారు. దీని వలన తమరికి మంచి పేరు రాగలదని సూచించారు. మందపాటి వారికి మీ ద్వారా యీ కార్యము నెరవేరుతుందని గట్టి నమ్మకం కలిగిందన్నారు. మీరు అంగీకరించి యీ కార్యమును విజయవంతంచేసి, ఇరు పక్షముల వారికి, ప్రజలకు మేలు కలిగించమని వేడుకొని యున్నారు. వారి సూచనలు, సలహాలు పాటించి తగిన విధముగా కార్యక్రమములు చేయుటకు పూనుకున్నారు.

యజ్ఞమునకు కావలసిన వస్తు వాహనములు తెప్పించారు. అతి ముఖ్యులకు జాబులు వ్రాయించి పిలిపించారు. స్థల నిర్ణయము, యజ్ఞ కాలములు తదితరములు వేద పండితులతోను, ఇతర ఋత్త్విక్కులతో సంప్రదించి సమయము కొరకు సంసిద్ధులై యున్నారు. శ్రీ యోగీంద్రుల వారు నిర్ణయించిన రోజు రాగా, వారిని రామచంద్రయ్య సహచరులతో సకల రాజ మర్యాదలతో ఆహ్వానించారు. ఫల పుష్ప పూజాది ద్రవ్యములతో సత్కరించారు. వారు పలుచోట్ల పరిశీలించి మహా యజ్ఞమునకు తగిన స్థలమును సూచించారు.

**యజ్ఞం :** శ్రీ యోగీంద్రులవారు యజ్ఞశాలలో అగ్నిగుండము

యజ్ఞవేదిక, కుండలీకరణీకము తదితరములు నిర్మించారు. త్రేతాగ్నులు రగుల్చుటకు తగిన విధముగా అమర్చి యజ్ఞ కార్యకర్తగా శ్రీ అద్దంకి రామచంద్రయ్యను నిర్ణయించి కార్యక్రమమును ప్రారంభించారు. యజ్ఞమునకు అవసరమైన కొబ్బరి, ఆవు నెయ్యి, రక రకములైన వస్తు సామాగ్రితో హోమగుండము వెలుగుచున్నది. వివిధ ప్రాంతముల నుండి మహాశక్తిని ఔపోషనము చేయుటకు వచ్చిన వేద పండితులు, ఋత్విక్కులు, మంత్రములు పఠిస్తున్నారు. త్రియాహ్నికము జరుగుచున్నది. శ్రీ యోగీంద్రుల వారి ఆధ్వర్యంలో అందరు కలసికట్టుగా వారి సూచనలు పాటిస్తూ కార్యక్రమమును నిర్వహించుచున్నారు.

**వెంకటగిరి వారికి వార్త అందజేయుట :** వెంకటగిరి రాజా పరిపాలనలో ఉన్నవారు, వారి అంతరంగికులు, కావాలని, కొందరు, కాని వారు కొందరు యీ వార్తను అఘమేఘాలమీద వెంకట గిరిరాజా అందజేశారు. రాజావారు మంత్రి పురోహితులతో ఆలోచించారు. అంతరంగికులు కొందరు మందపాటి వారికి యుద్ధం ద్వారా గుణపాఠం చెప్పాలని సూచించారు. మనం విజయం సాధించి వారిపై పెత్తనము చలాయించుటకు తగిన సమయము ఇదియని సూచించారు. మరికొందరు యుద్ధంవలన నష్టం కష్టం కలుగుతుందని చెప్పారు. వారు శాంతి యజ్ఞం నిర్వహించుకొనుచుంటె మనం యుద్ధం చేయుట దురాగతముగా ప్రజలు తలంచెదరు. మనకు చెడ్డ పేరు రాగలదు.

**యజ్ఞమునకు భగ్నం కలిగించుట :** దూరాలోచన గలవారు ఆలోచించి, మందపాటివారు చేయుచున్న యజ్ఞంను భగ్నం కలిగించి, ఆదిపరాశక్తి అవతరించకుండా ఏర్పాటు చేయవచ్చు అన్నారు. దానికి మనం మరొక యజ్ఞం ఆరంభించి, వారు చేస్తున్న యజ్ఞమునకు ఆటంకం కలిగించ వచ్చును. దీనివలన వారికి తగిన గుణపాఠము చెప్పినవారమౌతాము. మనకు కూడా మేలు జరుగుతుందని చెప్పారు.

ఇది అందరికి ఆమోదముగా తలంచి తగిన ఏర్పాట్లు చేయవలసినదిగా వెంకటగిరి రాజావారు సూచించారు. శక్తికి ప్రతిశక్తిని సృష్టించి ఆపదలు రాకుండా కాపాడగల పోలూరి వంశజులను పురికొల్పినారు.

వారికి సహాయకులుగా పరాంకుశం వారిని పంపించారు. వీరిద్దరూ పరా శక్తి ప్రసన్నోపేతులు. వీరు సృష్టికి ప్రతి సృష్టి చేయగల సమర్థులు. భూత ప్రేతాది పనులు బాగుగా తెలిసినవారు. రాజావారి అంతరంగిక అమాత్యశేఖరులు సింగన్న మాత్యుని ద్వారా సకల ధన వస్తు వాహనము లను సమకూర్చబడినవి. పెద్దూరు మందపాటి రాజులు తలపెట్టిన యజ్ఞమును భగ్నము చేయుటకు వెంకటగిరి రాజావారు పంపిన మాంత్రిక తాంత్రిక క్షుద్రశక్తీ సంపన్నులు, పండిత పరివేష్కకులు రహ స్యంగా పోలూరివారి గృహ సమీపములో హోమము సాగించారు.

ఇది తెలిసిన కొందరు అద్దంకివారి యజ్ఞమును ఆపుట కష్ట మన్నారు. శ్రీ యోగీంద్రులవారి మంత్ర తంత్ర శక్తి యుక్తులముందు పోలూరివారి ప్రయత్నములు వృధా అన్నారు. అనుభవము గలవారు ఎక్కడ ఏమి అంటే ఏమి జరుగుతుందో, రాజుల పరిపాలనలో జరుగు చున్న విషయములు తెలిసికూడా నిమ్మకు నీరెత్తినట్లు చూడవలసిందే గాని బయటకు పొక్కరాదని తలంచి ఫలితము కొరకు ఎదురు చూడ సాగారు.

అద్దంకి రామచంద్రయ్య యజ్ఞకర్తగా కూర్చుండి తదేకముగా సకల వస్తువులను హోమములో సమర్పించుచున్నారు. ఋత్విక్కుల ఋ గళయుగళముల నుండి వెలువడు వేద మంత్రములకు శక్తి స్వరూపం ఓంకార నాదంతో విన వస్తున్నాయి. యజ్ఞకుండలముల నుండి ఏక ధాటిగా ఎగసిన నిప్పు రవ్వలు గగనమున మేఘావృతమై కమ్ముకొన్న పొగ దట్టముగా కన్పించుచున్నది. ధూమరాశి ఆకారరాకరములుగా దట్టముగా అగ్ని కుండలముల నుండి వెలువడుచు జ్వలిత జ్వాలా మానమై ప్రకాశించుచున్నది. అదిగో శక్తిరూపం వస్తుందంట ఇదిగో దేవి ఆగమనం కలుగుతుందని పుకారులు భయాందోళనలును కలిగించు చున్నారు.

ఈ వార్త చారుల వలన తెలుసుకున్న పోలూరివారు పరాంకుశం వారు అద్దంకివారి యాగము నుండి ఉద్భవించుచున్న శక్తి స్వరూప

3)

మును, యజ్ఞకర్త రామచంద్రయ్యకు దక్కకుండా చిక్కకుండా, అంద కుండా పొందకుండా దారి మళ్ళించుటకు తగిన ప్రయత్నములు చేయు చున్నారు. అవాంతరములు కలిగించి యజ్ఞమును విఘ్నము చేయుటకు మంత్ర తంత్రములలో నిమగ్నులైయున్నారు. అంతేకాదు ప్రధాన కారకు లైన శ్రీ యోగీంద్రుల వారికి కొన్ని ఇబ్బందులు కలిగించి, అడ్డదారి త్రొక్కుటకన్నా మించిన మార్గములేదని తలంచారు.సక్రమమైన పద్ధతిలో పనిని సాధించలేనప్పుడు అడ్డదారికి పోవుట రాజకీయ నీతన్నమాట.

క్షుద్రశక్తులను సృష్టించి అంతర్గతముగా వాటిని ఎదుటి వారిపై ప్రయోగించి, తమ కర్తవ్యమును నెరవేర్చుకొనుట ప్రస్తుతం వారు తలం చిన పని. అవి సక్రమముగా పని చేయుచున్నది లేనిది తెలుసుకొను టకు కొంతమంది గూఢచారులను వినియోగించారు.

ఇక గురూపదేశంతో అద్దంకివారి యజ్ఞం నిర్విఘ్నంగా జరుగు చున్నది. శ్రీ యోగీంద్రులవారు కలశంలోని పసుపు నీటితో సంపోషణము చేయుచున్నారు. ఋత్విక్కులు షోడశోపచారములైన వేద మంత్రములతో మహాశక్తి స్వరూపము కొరకు ఆవాహనము చేయుచూ, ఎదురు చూస్తున్నారు. అమ్మవారి ఆగమనం జరుగుతుందని తలంచి శ్రీ యోగీం ద్రులవారు అద్దంకి రామచంద్రయ్యకు సైగ చేశారు. సర్వం సిద్ధము చేసు కొని పూర్ణాహుతి సమర్పించుటకై వేదమంత్రోచ్చారణముతో ఎదురుచూస్తు న్నారు.

చారులవలన యీ రహస్యము తెలుసుకున్న పోలూరివారు పర్హాం కుశంవారు మరుక్షణంలో శ్రీ యోగీంద్రులవారికి బాధను కలిగించే భయం కరమైన ప్రయోగం చేశారు. భరింపరాని కడుపు నొప్పితో మలమూత్ర విసర్జన కలుగునటుల తమ శక్తియుక్తులను వారిపై అంతర్గతముగా పేరే పించారు. దీనివలన ఏమి జరుగుతుందో వెంటనే తెలియజేయవలసినదిగా గూఢచారులను ఆదేశించారు.

శ్రీ యోగీంద్రులవారు మలమూత్ర విసర్జన బాధను భరించలేక బయటికి పోవలసి వచ్చింది. శక్తి స్వరూపం రాగానే పూర్ణాహుతి పూజాది కార్యక్రమములు నెరవేర్చవలసినదిగా రామచంద్రయ్యకు, తక్కిన

ఋత్విక్కులకు చెప్పి తప్పనిసరి పరిస్థితులలో బయటికి వెళ్ళారు.

త్రియాగ్నిక కుండలములనుండి మెరుపులా జ్వాలలు ప్రజ్వరిల్లు చున్నవి. కళ్ళు మిరిమిట్లు కొల్పుచున్నవి. తళుక్కున ఏదో ఆకారం ఉత్పన్నమైనట్లు, వచ్చి వారి ముందర నిలచినట్లు పొగలు సెగలు కమ్ము కొని భ్రమను కలిగిస్తున్నాయి. వేద మంత్రముల ఘోష, అగ్నిజ్వాలల పొగలు సెగలు దుర్యతరేకంగా భయంభక్తితో యాగ్నికముపైపుచూస్తున్న రామచంద్రయ్యకు శరీరం జలదరించింది. చెమటలుపట్టి కళ్ళు మూతలు పడుచున్నవి. ఇంతలో ఫేదో ఆకారం తళుక్కున మెరసి, అగ్ని జ్వాలల నుండి బయటికి వచ్చి తన ఎదుట నిలబడింది.

**శక్తిస్వరూపం (స్వయం) :-** ఆ ఆకారం రామచంద్రయ్యకు ఎఱుపు రంగులో, సూర్యబింబమువలె ప్రకాశిస్తూ, పన్నెండేళ్ళ బాల కుమారిగా కన్పించింది. కాళ్ళకు అందెలు, సుందరరూపం, పెద్దబొట్టు, కనులనుండి అగ్నిజ్వాలలు కురిపిస్తున్నట్లు కన్పించింది. చూచుటకు కూడా భయంగా ఉంది. ఆ జ్వలిత జ్వాలామయమై, తేజోవంతమైన కాంతి పుంజ ములను తేరపార చూడలేక వివశులైనారు కొందరు. ఆ మహాశక్తి కనుల నుండి అగ్నిజ్వాలలు ప్రస్ఫుటమౌతున్నాయి. వాటిని సూటిగా చూడలేక కనులు మూసుకొని విగతజీవులై, చైతన్యరహితులై స్థాణువులా నిలబడిపోయారు మరి కొందరు. రామచంద్రయ్యకు మతిపోయినంత పని అయి, చేయవలసిన కార్యములు మరిచిపోయి భయంతో నిలబడిపోయాడు. శ్రీ యోగీంద్రులవారి సూచనలు, సలహాలు ఎవరు పాటించలేదు. ఆచరించ లేదు. అసలు విషయము మరచిపోయారు. దీనికంతకు కారణం ఎదుటి వారు కలిగించిన అంతరాయమే యీ అనర్థానికి మూలం.

అగ్నిజ్వాలల నుండి ఆవిర్భవించిన మహాశక్తికి బలిహారముగాని, పూర్ణాహుతిగాని సమర్పించలేదు. శ్రీ యోగీంద్రులవారు చెప్పిన ప్రకారం అమ్మవారికి ఆహుతి ఇచ్చి ప్రసన్నం చేసుకొని తన ఆధీనంలో అవసరమైన కోరికలు నెరవేర్చుకొనవలసి ఉంది. ఆమెకు శాంతి కలిగించలేదు. వేడి తగ్గించలేదు. ఆహుతి సమర్పించలేదు. అందువలన అమ్మవారు ఆగ్రహించి ఊరు వీధిగుండా నడక సాగించింది. తదేక దృష్టితో పోతూ ఉంది. తన

ప్రళయకాల శక్తి స్వరూపాన్ని, అగ్ని జ్వాలల తేజోమయ కాంతిని చూడ లేక కొందరు ఎదురుపడినవారు కనులు మూసుకొని తొలగిపోవుచున్నారు. కళ్ళు-వళ్ళు మంటలు.

ఆమె చూపుల వాడికి వేడిమికి చెట్లు చివరలు కాలిపోతున్నాయి. గుట్టలు చివరలు తగలబడి పోతున్నాయి. ఇండ్ల వెలుపలగల గుడ్డలు కొంత కాలిపోతున్నాయి. ఊరు దాటింది. వాగు దాటింది. పొలిమేర దాటి తూర్పు దిశగా పోతున్నది.

**ఈతముక్కల :—** దీని పూర్వనామం ఇంతిముక్కు ఇలా దానికి శూర్పనఖ చరిత్ర కొంత చోటు చేసుకున్నది. ఈ గ్రామము నుండి వేకువ జామున జంగమదేవరలు ఇతర గ్రామములకు పనిపాటల నిమిత్తం బయలు దేరుట. పొలములో గల వేలాం నుండి పాడిపశువులు గలవారు కొందరు దుత్తలతోపాటు తీసుకొని వచ్చుచుందురు. అటువంటి వారిలో ఇనకొల్లు వంశజుడు రామస్వామిరెడ్డి తన వేలంనుండి గేదెలపాలు తీసుకొని వస్తు న్నాడు. వారికి నాగంవారు, శంఖులవారు జంగమ దేవరలు తోడైనారు. తమ ఊరివైపు వస్తున్న జ్వలిత జ్వాలాశక్తి రూపాన్ని చూశారు.

**జ్వాలాముఖి-ఈతముక్కల జాలమ్మ :-** ఏదో శక్తి అలిగి గ్రామం మీదకు వస్తుందని గమనించారు. ఆమెను అపుటకు ఆలోచిం చారు. జంగం వారు వచ్చిరాని మంత్రోచ్చారణలతో రెడ్డిగారి దుత్తలోని పాలు అందుకొని, భయంవీడి దగ్గరకు వచ్చిన అమ్మవారికి అందించారు. పాలన్ని త్రాగింది. తపన తీరింది. వేడి తగ్గింది. కళ్ళ నుండి వస్తున్న అగ్ని జ్వాలలు తగ్గిపోనారంభించాయి. అక్కడే ఆగిపోయింది.

కరుణ కలిగిందో శాంతి చెందినదోకాని అక్కడనుండి మాత్రం కదలలేదు. ముగ్గురు అమ్మవారిని వేడుకొన్నారు. మా గ్రామ ప్రజలకు అదిదేవతగా ఆపదలు రాకుండా కాపాడమని కోరుకున్నారు. ముఖము నుండి జ్వాలలు ప్రసరించుటచేత జ్వాలాముఖి అమ్మవారుగా ప్రసిద్ధి చెందు చున్నది. ఆకు తోటల మధ్య చల్లని ప్రదేశంలో ఈతముక్కలలో వెల యుట చేత ఈతముక్కల జాలమ్మగా, గ్రామదేవతగా నేటికి ప్రసిద్ధి చెందుచూ, పూజలు, పొంగళ్ళు చేయించుకొనుచున్నది. అల్లూరువారు,

పాద ౖతివాడు ఒక రోజుకి పసుపు కుంకుమలు తెస్తారట.

పరాయివారు కల్పించిన కారణమున శ్రీ యోగీంౖదులవారు బయ టికిపోయిన తర్వాత అద్దంకి రామచంౖదయ్య అమ్మవారిని ఆపలేకపోయా రని, అమ్మవారు దారితప్పి ఊరి పొలిమేర దాటిపోయిందని చారులవలన తెలుసుకున్న పోలూరివారు, పరాంకుశంవారు పరమానందం చెందారు. యజ్ఞం భగ్నం జరిగిందని సంతోషించారు. తమ పని పూర్తి అయినందున యజ్ఞయాగాదులు ఆపుచేసి యీ విషయం వెంకటగిరి రాజావారికి తెలియ జేయుటకు బయలుదేరి వెళ్ళారు.

మలమూౖత విసర్జన పని పూర్తిచేసుకొని, దేవాలయం బావి దగ్గర పవిౖతంగా స్నానంచేసి, యజ్ఞవాటికకు వచ్చిన యోగీంౖదులవారికి విష యం అర్థంగాక, అద్దంకి రామచంౖదయ్యను అడిగారు. వారు భయంతో జరిగిన విషయం చెప్పారు. వేదపండితులు, ఋత్విక్కులు మంౖతోచ్చార ణను మాౖతం ఆపకుండా వల్లిస్తున్నారు. అగ్ని హోమం మాౖతం యథా ౖపకారము ౖపజ్వరిల్లుచున్నది. కానివారెవరో కావాలని ఆటంకం కలిగిం చారని శ్రీయోగీంౖదులవారు తలంచారు. దీనికి ౖపత్యుపకారం కలిగించి వారికి బుద్ధిచెప్పాలనుకొన్నారు. తను తలచుకొంటే శక్తి స్వరూపంచేత వారికి నోరు, చెయ్యి పడిపోవునట్లు చేయగల సత్తా ఉండి కూడా అది మంచి పని కాదనుకున్నాడు. తలంచిన పని కాకుండా పోతుందా. కార్యము సాధించి, శక్తి స్వరూపంతో ౖపజలకు మేలుచెయ్యాలనుకున్నాడు. ఎదుటి వారికి కనువిప్పు కలిగించాలనుకున్నారు.

**మరో శక్తికి ౖపేరణ :—** మొదట వచ్చిన శక్తి అందకుండా పోయినప్పటికి యజ్ఞమునకు విఘ్నము కలుగకుండా వేద మంౖతోచ్చార ణము జరుగుచున్నది. రామచంౖదయ్యతో సమస్త వస్తువులు హోమములో వేయించుచున్నారు. తన యోగ బలంతో ఆవాహనము చేయుచున్నారు. మంౖత తంౖతములతో ఓంకార నాదం మారుౖమోగుచున్నది. యథాౖపకా రముగా అన్ని కార్యములను తు.చ. తప్పకచేయుచున్నారు ౖతియాగ్నికము నుండి అగ్నిజ్వాలలు ఉవ్వెత్తున ౖపజ్వరిల్లుచున్నవి. పొగలు సెగలతో గగనము మేఘావృతముగా చుట్టుపట్ల దట్టముగా అలముకొన్నవి. జ్వాలల

నుండి ఉల్కలు మధ్య మధ్యలో వస్తున్నవి. ఆకారాకృతముతో వెలు స్తున్నవి.

వేదమంత్రోచ్చారణముల మధ్య శ్రీ యోగీంద్రులవారు షోడశోప చారములయిన వివిధ కార్యముల ద్వారా అమ్మవారిని ఆవాహనముకొరకు, ఆపోహనము చేయుచున్నారు. శక్తి స్వరూపం ఏర్పడుటకు తగిన చిహ్నములు కన్పించుచున్నవి. అగ్నిజ్వాలల నుండి ఉల్కలు ఆకారరాకరములుగా పొగలు సెగల నుండి వెలువడుచున్నవి. శక్తి స్వరూపం ఏర్పడుటకు సంసిద్ధమైనదని ఇంకా అట్టే సమయము పట్టదని తలంచారు. వేద పండితులను, ఋత్విక్కులను రామచంద్రయ్యకు అతి మెలుకువతో ఉండవలసినదిగా సూచించారు. చేయవలసిన కార్యములు సిద్ధంచేయించారు. అక్షింతలు పట్టుకొని కొందరు పసుపు, కుంకుమ, నిమ్మకాయలతో కొందరు, పాలు, నెయ్యి, పండ్లు పలహారములతో మరికొందరు, పూర్ణాహుతి పట్టుకొని అద్దంకి రామచంద్రయ్య శక్తి స్వరూపంకొరకు ఎదురు చూస్తున్నారు. సంప్రోషనము చేయుచున్నారు. యోగీంద్రులవారు ఏదో మనస్సులో పలుమారులు తలంచుకొనుచున్నారు. కనులు మూసుకొని, భృగుటి మధ్యమున వెలుగును చూస్తున్నారు.

**ఉల్కాకారం** :- వేదమంత్రోచ్చారణములతో సమస్త కార్యములు సాధించిన మీదట సంప్రోషణములు జరుగు మధ్యలో అగ్నిహోమము నుండి జ్వాలలు-జ్వాలల మధ్యనుండి ఉల్కలు, ఉల్కల మధ్య నుండి ఏదో ఆకారము రాసాగింది. యోగీంద్రులు ఒక్కసారి ఓంకారం చేశారు. మంత్ర బీజములు వల్లించగానే ఉల్కల మధ్యనుండి మిరుమిట్లు కొల్పు క్రాంతి, తెల్లని ఆకారముతో వారి ఎదుట నిలబడింది. అమ్మవారి ఆగమనం జరిగింది.

**రాక** :- తెల్లని చీర నల్లని కురులు సుందర రూపం చంద్రబింబము వలె నుదుట బొట్టు,అభయ హస్తము చాపి చిరునవ్వుతో దేనికోసమో ఎదురు చూస్తున్నట్లు కన్పించింది. ఇది గమనించిన శ్రీయోగీంద్రులవారు అద్దంకి రామచంద్రయ్యతో పూర్ణాహుతి చేయించారు. పాలు, పండ్లు అమ్మవారికి అందించారు. ఋత్విక్కులు నిమ్మకాయలతో బలిహారం చేశారు.

ఎరుపు ముద్దతో అమ్మవారికి బలిహారము పెట్టారు. పసుపు నీళ్ళు చల్లి టెంకాయలు కొట్టి హారతి యిచ్చారు.

**పొలి** : ఆకలి తీరిందేమో చిరునవ్వుతో అమ్మవారు తొలి అడుగు వేసింది. రాబోవు ఆపదల నుండి ప్రజలను కాపాడవలసినదిగా అమ్మవారిని శ్రీ యోగీంద్రులవారు పొపోషనంచేసి అడిగారు. అమ్మవారు తలూపి మరొక అడుగు ముందుకు వేసింది. భయభక్తులతో అందరు మంత్రోచ్ఛారణములతో అమ్మవారిని అనుసరించారు. అమ్మవారు టంగుటూరి రామదాసు సత్రం దగ్గర ఆగింది. శ్రీ యోగీంద్రుల వారితో సహా వేదపండితులు, ఋత్విక్కులు అమ్మవారిపై అక్షింతలు వేశారు. అక్కడి నుండి బయలుదేరి యజ్ఞకర్త శ్రీ అద్దంకి రామచంద్రయ్య ఇంటి వద్ద ఆగింది. అక్కడ కూడా అమ్మవారిపై అక్షింతలువేసి పసుపు నీళ్ళు చల్లారు. అక్కడనుండి బయలుదేరి పశ్చిమదిశగా పయనించి, దండుబాట దాటి వల్లూరు చెరువులో కట్ట దిగువన నిలచిపోయింది.

**నిలకడ** : వల్లూరు చెఱువు కట్ట క్రింద నిలచిన అమ్మవారిని శ్రీ యోగీంద్రులవారు అద్దంకి రామచంద్రయ్య ఇతర మంత్రవేత్తలద్వారా అక్షింతలు వేయించారు. అమ్మవారు కదల లేదు. ఋత్విక్కుల ద్వారా మంత్రోచ్ఛారణ చేయించారు. అమ్మవారు కదలలేదు. పసుపునీళ్ళు చల్లించారు. గావు చేయించారు. కుంభము పోయించారు. అయిన అమ్మవారు కదలలేదు. నోరు మెదపలేదు. నిలకడగా ఉంది.

**గణాచారి** : ఇంతలో ఒకరికి పూనకము వచ్చింది. కేకలు వేయటం మొదలుపెట్టాడు. విషయం తెలుసుకున్న శ్రీ యోగీంద్రులు వాడు పసుపునీళ్ళు చల్లించి, విషయము ఏమిటని అడిగారు. వెంటనే వాడు, నేను అమ్మవారిని, నేను ఇక్కడనే ఉంటాను. గ్రామమును రక్షిస్తుంటాను. ఈతి బాధలు రాకుండా చూస్తుంటాను. మీ కోరికలు తీరుస్తుంటాను. నాకు కావలసినప్పుడు పూజలు, పొంగళ్ళు, కొలుపులు, జాతరలు, చేయించమని పలికింది. ఆచారములు, వేడుకలు చేయించండని అడిగింది. అందరు సంతోషించారు. పసుపు కుంకుమలతో అమ్మవారిని పూజించారు. కాపాడమని వేడుకున్నారు. జరుపవలసిన

తతంగములన్నీ శ్రీ యోగీంద్రులవారు దగ్గర ఉండి అద్దంకి రామ చంద్రయ్య ద్వారా జరిపించారు. విషయము తెలుసుకున్న మందపాటి రాజులు ఆనందించారు. శ్రీ యోగీంద్రుల వారితో సహా అంపకెని అభినం చారు. కొంచరెని తమ దూతల ద్వారా పంపి సత్కారము చేశారు.

**కాబట్టి వెంకటగిరి రాజుల, ఒంగోలు మందపాటి రాజుల కలహముల కారణముగా వల్లూరులో అమ్మవారు ఉల్కాముఖి పేర వెలసిందనేది యధార్థము.**

**ఉల్కాముఖా? వల్లూరమ్మా :** శ్రీ యోగీంద్రులవారి ఆధ్వ ర్యంలో శ్రీ అద్దంకి రామచంద్రయ్య ద్వారా నిర్వహించిన అగ్నిగుండం నుండి మొదట జ్వాలాముఖి అమ్మవారు ఉద్భవించిన తర్వాత ఉల్కల నుండి అమ్మవారు ఉద్భవించినది. ఈ శక్తి స్వరూపమే ఉల్కాముఖి అమ్మ వారు. అమ్మవారికి ముందే వల్లూరు ఏర్పడి యుండుటచేత వల్లూరమ్మగా వ్యవహరింపబడుచున్నది.

**ఉల్కాముఖి వల్లూరమ్మగా:** అమ్మవారు శక్తి స్వరూపం. అగ్నిగుండము నుండి స్వయముగా వెలసిన దేవత. ఒక మహా కార్యము కొరకు వెలసిన శక్తి స్వరూపం. ఈతి బాధలు, చీడ పీడలు రాకుండా ప్రజలను కాపాడుట కొరకు వెలసినది. ఉల్కాముఖి అమ్మవారుగా వల్లూరులో శిలయై సర్వులకు కన్పించుటచేత గ్రామ ప్రజలే గాక ఇతరులు కూడా వల్లూరమ్మగా పిలుచుకొనుటకు వీలుకలిగింది. నేటికి మహాత్మ్యము కలిగి ప్రసిద్ధి చెందుచున్నది.

**అమ్మదయ :** ఆమె రాత్రిపూట గ్రామ గవిళ్ళు కాస్తున్నది. ఇతర గ్రామ పొలిమేరల నుండి భూత, ప్రేత, పిశాచ గణములను రాకుండా చూడగలుగుచున్నది. చుట్టుపట్ల గ్రామాల వారికి ఆపదలు రాకుండా ఆదుకొనుచున్నది. పశువులకు, పైరులకు, మనుష్యులకు స్ఫోటకము వగైరా వ్యాధులు రాకుండా రక్షించుచున్నది. చల్లని తల్లి ఉల్కాముఖి, వల్లూరమ్మ పరాశక్తి, స్వయంభువు.

**శ్రీ ఉల్కాముఖి - శ్రీ వల్లూరమ్మ అద్దంకివారి ఆడపడుచు:-** పూర్వం మందపాటి రాజుల కాలంలో వల్లూరులో నివసించు పలు కుటుం

బములలో అద్దంకి వంశజులు అతి ముఖ్యులు. వీరు మొదట నుండి దేవి ఉపాసకులు. గ్రామములో కీలకమైన పాత్ర వహించు నియోగు బ్రాహ్మణులు ప్రముఖంగా ధాతువైద్యం తెలిసినవారు. రాచకార్యములలో నుండుటచేత అందరికి ఆమోదముగా నుండెడి వారు. గ్రామంలోగాని ఇతర విషయము లలోగాని వ్యవహారము కలిగినవారు పరిష్కారములు చేయు చుండెడివారు.

అందువలన పెళ్ళూరు మందపాటి రాజులు అద్దంకి రామ చంద్రయ్యను పిలిచి, వెంకటగిరి రాజుల వలన ప్రమాదములు జరగ కుండా శక్తి స్వరూపము ఏర్పడుటకు కారకులైన విషయము తెలిసినదే కదా. ఉల్కాముఖి వరపు వల్లూరమ్మ పుట్టుటకు కారకులు అద్దంకివారు. వారు సలహా సంప్రదింపుల ద్వారా అగ్నిగుండము నుండి స్వయంగా పుట్టినది. దేవత స్వరూపం మాత్రమే కాని క్షుద్రశక్తి కాదు. అందువలన ప్రతివారు ఉల్కాముఖి అద్దంకివారి ఆడపడచు. వారి ఇలవేల్పుగా మొదటి నుండి పూజిస్తారు. తర్వాతనే ఇతరులు పూజలు అందుకొనుట జరుగు చున్నది.

తమ ఆడపడుచుగా చీర రవికలు-పసుపు కుంకుమాది పూజా ద్రవ్యములు ఒసగుచుందురు, వడపప్పు పానకము మొదట అద్దంకివారు సమర్పించుచుందురు. తర్వాత ఇతరులు మొక్కుబడులు చెల్లించుచుందురు. నాటినుండి నేటివరకు ఇలానే జరుగుచున్నది. అందువలన గ్రామ ప్రజలు వల్లూరమ్మను అద్దంకివారి ఆడపడుచుగా అభివర్ణించారు.

**వంశవృక్షం :** వల్లూరులో నివశించు బ్రాహ్మణ వంశములలో అద్దంకివారు ఒకరు. అద్దంకి వంశజులలో రామచంద్రయ్య-బుచ్చయ్య అన్నదమ్ములు.

1) రామచంద్రయ్యకు వెంకట కృష్ణయ్య, వెంకట కృష్ణయ్యకు వెంకటసుబ్బారావు, వెంకటసుబ్బారావుకు విద్యాసాగర్ (బుజ్జి) అనువారలు.

2) బుచ్చయ్యకు శ్రీరామమూర్తి, శ్రీరామమూర్తికు వరదయ్య, వరదయ్యకు చిన్నబుచ్చయ్య, చిన్నబుచ్చయ్యకు నరసింహారావు, నర సింహారావుకు సూర్యనారాయణ తదితరులు కలిసి గ్రామములో కీలక పాత్ర వహించుచున్నట్లు తెలియుచున్నది. వీరు మొదటినుండి ఉల్కా

ముఖి అమ్మవారి విషయములో ప్రధానపాత్ర వహించుచూ, నిత్యపోషకులుగా పేరు పొందిరి.

**భాగవతులవారు :** శ్రీ భాగవతుల రాధాకృష్ణమూర్తి (రామకృష్ణ) గారి సంతతిలోని దక్షిణామూర్తిగారి ఆడపడుచును అద్దంకి వంశజులలో ఒకరికి యిచ్చి వివాహము చేసియున్నందున బంధుత్వం ఏర్పడి సుఖజీవనము సాగించుచుండిరి. వీరు వైదిక కర్మలకు వారసులుగా నుండి గుడిగోపురములు, పురాణ కాలక్షేపములు నిర్వహించెడివారు. అమ్మవారికి జరుగు వేడుకలలో అద్దంకివారితో కలసి పలు కార్యక్రమములు చేయుచుండిరి.

ఉల్కాముఖి అమ్మవారు ఈలా రూపంలో అవతరించిన తర్వాత అద్దంకివారు భాగవతులవారు తదితర అగ్రహారీకులు అమ్మవారికి గుడి గోపురములు, నిత్య నైవేద్యములు కల్పించుటకు పూనుకున్నారు. భాగవతుల వంశజులలో దక్షిణామూర్తికి పిల్లలు లేనందున అద్దంకివారు కౌండిణ్యగోత్రీకులైన భాగవతుల వెంకటనర్సయ్య పంతులు గారిచేత 1770లో శంఖుస్థాపన చేయించి, గుడినిర్మాణం ప్రారంభించినటుల తెల్పారు.

**1776 నలనామ సంగరం :-** ఉల్కాముఖి వల్లూరమ్మ శిలలకు ప్రాణప్రతిష్ట అద్దంకివారు చేయించారు. సంప్రోషణ జరిపించారు. ప్రతినిత్యం ఏదో సమయంలో అద్దంకి రామచంద్రయ్య వచ్చి పూజాది కార్యక్రమములు నిర్వహించి పోతుండేవారు. వారం పదిరోజులకు పొంగలి నైవేద్యం పెడుతుండేవారు.

**అమ్మవారి దినచర్య :-** పదుగురికి ఏదో రూపంలో కన్పిస్తుండేది. ఉల్కాముఖి అమ్మవారు రాత్రులందు జనం మాటుమణిగిన తర్వాత ఆపదలు రాకుండా నాలుగుదిక్కుల కాపాడుచుండేది. తిరుగుచుండెడిది. మేలిముసుగు వేసుకొని, గాజుల సవ్వడిలో, గజ్జల మ్రోతలతో కొందరికి కన్పించటం, వినిపించటం జరుగుచుండేది. దేవీ ఉపాసకులైన శ్రీ యోగీంద్రులవారికి, అద్దంకి రామచంద్రయ్యకు పిలిస్తే పలికేది. వారు కోరింది నెరవేర్చేది.

అమ్మవారు ఆదిపరాశక్తి అవతారమూర్తియైన పార్వతమ్మగా వల్లూరు గ్రామవాసులకేగాక, పరిసర గ్రామవాసులకు కూడా ఆపదలు రాకుండా కాపాడగలుగుతుంది. ఒకవేళ ఏదైనా పశువులకు, పైరులకు, మనుష్యులకు, స్ఫోటకము మొ॥ వ్యాధులు సంభవించినప్పుడు, అతివృష్టి అనావృష్టి వలన ఈతిబాధలు కరువు కాటకములు ఏర్పడినప్పుడు, వాటి నివారణకు శక్త్యానుసారము వడపప్పు, పానకము అద్దంకివారి ఆధ్వర్యంలో మొదట జరుగుచుండేవి. జాతరలు, కొలుపులు, పొంగళ్ళు పెట్టుకుంటారు. శైవాగమం ప్రకారం పూజలు, అష్టోత్తరములు, భజనలు జరుగుచుండేవి. అమ్మవారు ఆనందం చెంది, సమస్యలను పటుసాయం చేస్తూండేది.

**అమ్మవారికి పూజా నిర్వాహకులు** :- పనిపాటల వత్తిడి చేతను, వయోభారము వలన అద్దంకి రామచంద్రయ్య తనకు అనుకూలురైన కాశ్యప గోత్రీకులు, అపస్తంభ సూత్రులు అయిన దేవరపాలెపు ఉల్లభి అనువారిని ప్రథమంగా అర్చకులుగా నియమించారు. అమ్మవారికి పూజలు చేయుటకు నైవేద్యము సమర్పించుట చేయుచున్నారు.

అలాగే కొలుపులు, జాతరలు, పొంగళ్ళు పెట్టుకొనునప్పుడు పాల్గొను పనిపాటలవారైన కుమ్మరులు, మంగలి, చాకలి, మాదిగ తదితర వృత్తులవారికి కూడా జీవనోపాధి కల్పించి, కొంతకాలం ఆనందోత్సాహములతో అమ్మవారు వేడుకలు నిర్వహించుచున్నారు.

**అమ్మవారి కాలభైరవుడి కథ** :- అమ్మవారి గుడి సన్నిధిలో గల కాలభైరవుడి కథ ఒకటి చారిత్రకంగా తెలుస్తుంది. కాలభైరవుడు అనగా కాలమునననుసరించి అమ్మవారి సలహామేరకు కనిపెట్టుకొని యుండువాడు. శివుని మూడవ కన్నునుండి ఉద్భవించినవాడని కూడా అర్థం. ఆదిపరాశక్తి పార్వతమ్మ వారికి తోడుగా నియమించినవాడని కొందరి వాదన. అమ్మవారి ఆజ్ఞ కావాలన్నా, అమ్మవారు లేనప్పుడు ఎవరు గుడిలోకి, పరిసర ప్రాంతాలకు రాకుండా కాపలా కాయుచుండువాడు. అమ్మ ఆజ్ఞకు లోబడి ఎటువంటి ఆపదలు రాకుండా చూచుటకు అమ్మవారిచేత నియమించారని చెప్పారు.

ప్రతిరోజు రాత్రిపూట అమ్మవారు గ్రామక్షేమం కొరకు గ్రామ గవిష్కు చూచుటకు నాలుగు దిక్కులకు వెళ్ళుచుండుట, తెల్లవారుజామున తిరిగివచ్చుట పరిసర ప్రాంతాలలో తిరుగుచుండెడి బుడబుక్కలవాడు గమనిస్తూండేవాడని, ఒకరోజు రాత్రి అమ్మవారు లేని రాత్రి సమయంలో భైరవుడి కళ్ళుకప్పి గుడిలోకి ప్రవేశించాడు. తిరిగి వచ్చిన అమ్మవారిని గమనించి, భయంతో పరుగెత్తపోగా, అమ్మవారు వాడిని శిలగా మార్చిం దని కొందరి పూర్వీకుల వాదన. అదే యీ శిల్పమని చెప్పుకొనుచుందురు. కాని శిల్పము పరిశీలించిన ఆగమశాస్త్రకోవిదులు అది వాస్తవము కాదని తెలియజేశారు. ఇప్పటికి కాలభైరవుడి శిలావిగ్రహం ముఖమండపం దగ్గర ఉత్తరదిశలో నిల్చబడియున్నది. గమనించండి.

**దారి ఆతుంకం :-** అమ్మవారి గుడి చిల్లచెట్లతోను, ముళ్ళపొదల తోను నిండియుండెడిది. గుడికి పోవుటకు సరైన దారి మార్గం ఉండేది కాదు. పల్లేరుకాయలమయం. అయిన ఉల్లిభి కుమారుడు రామయ్య కొంత కాలం చేశాడు. అద్దంకివారికి ఆప్తులు, మిత్రులు అయిన పచ్చవ పాపయ్య గారు కొంతకాలం పూజాది కార్యక్రమములు చేశారు. శుక్రవారం అమ్మ వారికి నైవేద్యంపెట్టి వస్తూండేవాడు. చుట్టుపట్ల పిల్లలు, గొడ్లు కాచుకొను వారు వస్తే వారికి పలహారం పెట్టేవాడు. రాత్రిపూట జనసంచారం మాత్రం పొయ్యేదికాదు. కీచురాళ్ళ ధ్వనులతో భయం భయంగా ఉండేది. పూజారికి వృత్తిక్రింద ఇచ్చిన మాన్యం సరిగా పండేదికాదు. వర్షములు పడితే చెఱువు లకు నీళ్ళు, లేకుంటే బీళ్ళుగా మారేది. చాలీచాలని ఖర్చులతో జీవనం సాగించేవారు. ఆయన తర్వాత కుమారుడు పచ్చవ కుమారస్వామి కొంత కాలం నిర్వహించారు. వీరి కుమారుడు వెంకట సుబ్బయ్య అమ్మవారికి పూజలు నైవేద్యములు జరుపుచుండెడివాడు.

**అమ్మవారి తిరునాళ్ళ :** అద్దంకివారి ఆధ్వర్యంలో అమ్మవారి పూజలు, నైవేద్యములు పచ్చవవారి అర్చకత్వం క్రింద జరుగుచుండెను. అయితే వర్షములు లేక చెఱువులు ఎండి కరువులు వచ్చినప్పుడు, లేక ఊరిలో రకరకములైన జబ్బులు కలిగినప్పుడు, వాటి నివారణకు, ఆప దలు రాకుండా కాపాడమని, గ్రామపెద్దలు కలిసి మాట్లాడుకొని అమ్మ

వారికి వడపప్పు, పానకము, జాతరులు, కొలుపులు, పొంగళ్ళు చేయిస్తుం టారు. మొక్కుబడులు తీర్చుకుంటారు. ఇది ఐదు సం॥ర॥ల కొకసారి చేస్తుంటారట. పంచాహ్నికము అను తిరునాళ్ళ 5 రోజులు తగ్గకుండా చేయుదురట. దీనిలో రకరకాల కార్యక్రమములు చేయుదురు. దీనికి చుట్టు పట్ల గ్రామాలైన పెళ్ళూరు, పలిజర్ల, కందలూరు, చెరువుకొమ్ముపాలెం, కారుమంచి, సూరారెడ్డిపాలెం, మల్లవరప్పాడు, ఈతముక్కల, మడనూరు, మొ॥ పదెపన్నెండు దేవరలుగలవారు వచ్చుచుందురు.

**చాటింపు :** తిరునాళ్ళ జరుగుటకు ముందురోజు వెట్టివానిచేత, లేక మాదిగవానిచేత చుట్టుపట్ల గ్రామాలలో చాటింపు వేయిదురు. బలి హారం వస్తుంది కనుక జాగ్రత్త పడవలసినదిగా చెప్పెదరు. ముఖ్యులైన వారందరికి పనిమనుష్యులచేత కబురు పంపుదురు. ఈ బలిహారము తిరుగె టప్పుడు పిల్లలు, గర్భిణీ స్త్రీలు, బాలింతలు, గొడ్డు గోదా ఎవరు అడ్డు రావద్దని, అలావస్తే హానికరమని హెచ్చరిక చేయుదురు. వివిధ వృత్తుల వారు వారివారి ఆచారము ప్రకారము పనులు చేయుచుందురు. బైనిడివారు, పంబజోళ్ళవారు తదితరులు మేళతాళములతో మొదట అద్దంకివారి ఇంటికి వెళ్ళి, అక్కడ పావనముతో ఊరేగింపుగా వస్తారు. ఈ పావనము కుమ్మ రులు ఎత్తుకొందురు. ఆచారము గలవారికి బైనీడువారు గుగ్గిలములతో దేవర ఎక్కిస్తారు. ముద్రగడకర్త ఇంటివద్ద నుండి పొలికేకలతో, ఆనం దంతో బయలుదేరుతుంది ఊరేగింపు.

**ఆచారములు :** పూలకప్పెర (గుమ్మటం) తంతులు (ప్రయో గం) సుడికప్పెర, రణకప్పెర, గుడ్లకప్పెర తదితర తతంగములు కుమ్మరులు చేయుదురు.

**కత్తి-గజ్జ :** ఈ తిరునాళ్ళ జాతరలో మరొకటి కత్తి-గజ్జద్వారా నాట్యముచేయుట. అచారము ప్రకారము దీనికి మాదిగలు ప్రధాన పోష కులు. తూములూరి, తలారి వంశములలోని ఎకోటు; తిరుపాలు తది తరులు అంగీకరించి కాలికి గజ్జలు కట్టి, బారుకత్తి, చేతిరుమాలుపట్టి, తప్పెటలు, సన్నాయిడోళ్ళు, పంబజోళ్ళు మ్రోగంగా, బైనీడివారి మంత్రం, గుగ్గిలంతో పొగలమధ్య దేవర ఎక్కించుచుండ, శివమెత్తిన

వారయి చిందులు త్రొక్కుచు, నాట్యమునకు ఉపక్రమింతురు.

ఇతడి వాలకంచూస్తే భయంకరంగా ఉంటుంది. ఆరున్నర అ॥ భారీమనిషి దృఢకాయుడు, బొర్రమీసాలు, పెద్ద కనుగుడ్లలతో తలగడ చుట్టి, అరుపులు కేకలతో చూసేవారికి ఆశ్చర్యం, భయం కలిగిస్తుంటాడు. తప్పెట్లు, పంబజోళ్ళు, శంఖునాథం, మేళతాళములతో నాట్యము చేయుచూ, అడుగులు వేయుచూ, చేతులు త్రిప్పుచూ, కులుకుతూ, పలు కుతూ గ్రామ ప్రధాన వీధులగుండా ఊరేగింపు బయలుదేరుతుంది. జనం ఆనందంతో తండోప తండాలుగా ఉంటారు.

**బొల్లి ఆవు-పుల్లఎద్దు** :- ఇది యాదవ వంశజుల ఆచారము. దేవతాంశముతో కూడిన బొల్లిఆవు, పుల్లఎద్దు (ఒంటికొమ్ము)ను దేవరగల యాదవులు భుజముపై ధరించి, వీరతాళ్ళు, బారెడు కత్తితో రంగప్రవేశము చేయుదురు. గంగసేవకులుగా వీరు యీ కొలువులలో పాల్గొనుట వారి ఆచారము. కాకర్లవారు మొదట గంగమ్మ దేవతకు పూజచేస్తారు. పావనములోగల వీరతాళ్ళకు, బారెడు కత్తికి పసుపు కుంకుమలతో పూజ చేస్తారు. గంగమ్మతల్లి ప్రధాన క్షేత్రపాలకురాలు. జంగంకుంట్ల పిచ్చి కుంట్లవారు పాల్గొంటారు.

ఈ బొల్లిఆవు-పుల్లఎద్దు తేలికరకం చెక్కతో బరువు లేకుండా సున్నితంగా తయారుచేయుదురు. ఎఱుపు తెలుపురంగు విగ్రహములు-రకరకాల చిత్రములతో బొమ్మలు క్రిందిభాగము పీఠమును భుజముపై పెట్టుకొని, ఎగురుటకు నాట్యము చేయుటకు వీలుగా బారుబల్లతో చెక్కతాపడము, వాటిమెడలో మువ్వలు, వీరత్రాడు కట్టబడి యుండును.

ఆచారము ప్రకారం దేవరకు బైనీడువారు ఎక్కించిన తర్వాతఅరుపులు కేకలతో చిందులు వేయుట, వీరతాళ్ళతో ఒకరినొకరు చేతులపై కొట్టుకొనుట, బారుకత్తితో వంటిపై నరుకుకొనుట జరుపుకొనుచుందురు. చూచేవారికి ఎక్కడ శరీరం తెగిపోతుందోనని భయం కలుగుతుంది. దేవరబట్టినవారికి ఉత్సాహం కలిగించుటకు మేళతాళముల వారిధ్వనులు, తప్పెళ్ళవారి శబ్దములు, పంబజోళ్ళవారి మ్రోతలు, కొమ్మువారి ధ్వనులు విపరీతంగా చెవులకు ధ్వనులు కలిగించేటంత మ్రోత మోగించెదరు.

వీరంగం వేయుచూ, గజ్జల మోతలతో నాట్యము చేయుదురు. ఆనందో త్సాహములతో ముందుకు ఊరేగింపుగా సాగిపోవుచుందురు.

**మాతంగికన్య :-** అమ్మవారి కొలుపులు, జాతరలలో మాతంగి కన్యపాత్ర మరో ముఖ్యమైన సందడి. అనాదినుండి వస్తున్న ఆచారము ప్రకారమైతే, దేవళములలో స్వామి ప్రీత్యార్థం దేవదాసీలుండేవారు. స్వర్గంలో ఊర్వశి తదితరులాగా యిక్కడ దేవళములలో పలు భంగిమ లలో నాట్యము చేయుచుందురు. నృత్యములు ప్రదర్శించుచుందురు. రాజుల కొలువులో కూడా నాట్యంచేసి రసికులను ఆనందపరచుట ఆచారంకదా,

అలాగే అమ్మవారి కొలుపులు జరుగునప్పుడు నృత్యం చేయుటకు వచ్చినవారిని మాతంగి కన్యలని మనం పిలుచుట జరుగుచున్నది. మాతంగ మునికన్యనికూడా పిలువబడుచున్నది. కన్యగా నుండగనే శంఖ చక్ర గదా ముద్ర వేస్తారు. తర్వాత వారికి పెండ్లి జరగకుండా కన్యలుగానే యిలా ప్రదర్శనలు ఇస్తూంటారు. వీరు మద్యమునకు బానిసలై వివిధ రకముల నృత్యములతో భక్తులను, దేవతలను ఆనందింపజేయుదురు. ఆచారముగల ఇతర దేవతలతో యీమె హుషారుగా వీరంగం వేస్తుంది. చిందులు తొక్కుతుంది. ఈమె చేస్తున్న నృత్యం నాట్యం, నడకతీరు, హావ భావములు జాతరలలో చేరినవారికి ఉల్లాసం కలిగిస్తుంది. అటు కత్తి గజ్జ కట్టినవారికి, ఇటు బొల్లావు పుల్ల ఎద్దు ఎత్తుకున్నవారిని, ఉడికిస్తూ, ఉలికిస్తూ, కవ్విస్తూ, నవ్విస్తూ, అడుగులువేయుచూ, అందరిచేత వేయిస్తూ, ఊరేగింపుగా వీధులగుండా వూరంతా తిరుగుతూ, తెల్లారేసరికి గుడి దగ్గరకు చేరుతుంటారు. ఆనందంతో ఎగురుతుంటారు.

**గుడిదగ్గర వేడుకలు :** అమ్మవారి గుడి సమీపించినకొలది వేడుకలు ఎక్కువై, వేపమండలతో కొట్టుకొనుచు, పూనకం వచ్చి హాహాకారాలతో ఊగిపోతుంటారు. పసుపునీళ్ళు చల్లి, కొబ్బరికాయలు కొట్టి, "అపచారం ఎందమ్మా" అని అడుగుతుంటారు. దయ్యాలు పట్టిన వారి కేకలు, ఏడుపులు వినవస్తుంటాయి.పిల్లలు లేనివారందరు వరపడుతుం టారు. గ్రామపెద్దలు అందరినీ తృప్తిపరచుచూ, ప్రశాంత వాతావరణంలో గుడి చుట్టూ ప్రదక్షిణలు చేస్తారు. ఎడ్లబండ్లను త్రిప్పుకొంటారు.

ఇక గుడిదగ్గర అమ్మవారికి వడపప్పు, పానకము చెల్లించేవారు కొందరు. పొంగళ్ళు పెట్టుకొన్నవారు గుడిచుట్టు ప్రదక్షిణలు చేస్తూ, మా కోర్కెలు తీర్చమ్మా. మమ్ము కాపాడమ్మా అని మనస్సులో వేడుకొంటుంటారు. పసుపు కుంకుమలతో పూజించేవారు యెక్కువగా కన్పిస్తుంటారు. అమ్మవారికి అభిషేకము చేయించువారు, అష్టోత్తరములు చెప్పించుకొను వారు పూజలు జరిపించుకొనువారు రద్దీగా ఉండెదరు. ప్రధాన అర్చకులు యీ సమయంలో ఒకరిద్దరు పూజారులను అదనంగా పెట్టుకొని కార్యక్రమములు నిర్విఘ్నంగా జరిపించుచుందురు. మొదట శైవాగమ పద్ధతిలో అద్దంకివారు పూజలు జరిపించి, నైవేద్యము సమర్పించిన తర్వాత ఇతరులు అమ్మవారికి నైవేద్యములు సమర్పింతురు. మొదట జంతుబలులు లేవని కొందరి పూర్వీకులు తెల్పియున్నారు. అద్దంకివారి సహాయాలను కోరి కొందరు పోలేరమ్మ తల్లి శిలను, గంగమ్మ దేవత శిలలను కూడా చేర్చుట చేత తర్వాత జరుగు జాతరలతో కోళ్ళు కోయుట, వేట తదితర జంతు బలులు చోటు చేసుకున్నట్లు తెలియుచున్నది.

**అమ్మవారి మహిమలు :** కోకొల్లలు అప్పట్లో పూజారి జాతర అనంతరం మరచి చిన్న గుడి తలుపులు వేసుకొని ఇంటికి వచ్చాడట. గుడిలో పది సం॥ల బాలుడుని మరచిపోవుట జరిగింది. అనేకచోట్ల వెదకి చివరకు మూడవరోజున గుడితలుపులు తెరవగా పసిబాలుడు నిద్రావస్థలో ఉండినట్లు ఎటువంటి ప్రమాదంగాని పరిస్థితులుగాని జరగకుండా అమ్మ కాపాడిన వైనము తన తాత తండ్రులు చెప్పుకొనెడివారని గూడల బంగారయ్యద్వారా కొందరికి నేటికీ తెలియజేయుచున్నారు.

**అమ్మవారి విగ్రహ ప్రతిష్ఠ, వీరభద్రాచారి పాత్ర :** అద్దంకి రామచంద్రయ్యవారి తమ్ముడు బుచ్చయ్య వారసులు కలసి, ఆయన జ్ఞాపకార్థం శిలకు బదులు విగ్రహం తయారు చేయించి, ప్రతిష్ఠించాలనే ఆలోచన కలిగింది. వ్యవసాయపు పనిపాటలలో గ్రామపెద్దలకు సహచరులు, ఇండ్లకు, వాకిళ్ళకు కొయ్య శిల్పములు చెక్కుటలో సిద్ధహస్తులు అయిన విశ్వబ్రాహ్మణులు, వీరభద్రాచారిని అమ్మవారి విగ్రహం తయారు చేయుటకు ప్రయత్నించవలసినదిగా కోరియున్నారు. వారు పల్లు

చోట్ల తిరిగి చీమకుర్తి, కాళహస్తి తదితరచోట్ల చక్కనిరాతితో విగ్రహమును సుందరంగా జీవకళ ఉట్టిపడునట్లు తయారు చేయించి, ఒక శుభ సమయమున వల్లూరు తీసుకొని రావటం జరిగింది. అందుకుగాను అద్దంకి వారు గుడి వ్యవహారములలో చేదోడు వాదోడుగా నుండుటకు వీరభద్రాచారిగారికి కొంత మాన్యమును అనుభవించుటకు హక్కును కలిగించారు. వారి తర్వాత వారి మనుమడు బాల కోటాచారి గ్రామంలో వుంటూ వ్యవసాయపు పలులు, తయారుచేసి, రైతులకు అందించు యేగాక గుడి



చతుర్భుజే చంద్ర కళావతంసే కుచోన్నతే కుంకుమరాగ శోణె
పుండ్రేక్షు పాశాంకుశ, ఖడ్గ డమరహస్తే నమస్తే జగదేకమాతః.

4)

విషయంలోకూడా కొంత సహకారము అందించేవాడని తెలియుచున్నది. వారి వంశంవారు ప్రస్తుతం వల్లూరులో లేనందున వారి కుమారులు డా॥ రత్నాచారిగారు, తనకు సంక్రమించిన మాన్యమును కందులూరు పోతూరి కోటయ్య చౌదరికి అమ్మివేసినట్లు, ఉద్యోగరీత్యా వెళ్ళిపోయినట్లు తెలుస్తుంది.

శ్రీ అద్దంకివారు ఉల్కాముఖి శిలలను తొలగించి దాని స్థానమున ఆ చిన్న గుడిలో చతుర్భుజములు కలిగిన అమ్మవారి రాతి విగ్రహమును ప్రతిష్ఠించారు. యథాప్రకారం విగ్రహ ప్రతిష్ట ముందు రోజు తిరునాళ్ళ జరిపించారు. అమ్మవారి ప్రభావం నలుదిశల వ్యాపించింది. వెన్నెల వెలుగై ప్రసరిస్తుంది. అమ్మవారి రూపం లలిత దేదీప్యమానమై భక్తులకు ఆనందం కలిగిస్తుంది.

చతుర్భుజములలో ఒక చేతిలో ఖడ్గము రెండవ దానిలో త్రిశూలం మరొక చేతిలో డమరకము నాల్గవ చేతిలో అభయహస్తం కుంకుమతో కలిగి, ముఖమున చంద్రశోభితమై, ప్రకాశవంతంగా చిరునవ్వులతో భక్తులను ఆనందంగా మరపిస్తుంది. భక్తిభావం కలిగిస్తుంది.

**బలిజల తగాదా :** ఉల్కాముఖి వల్లూరమ్మ తిరునాళ్ళ జాతర, కొలువులు, జరిగే సందర్భంగా మాదిగలకు, బలిజలకు తగాదాలు వచ్చాయి. మాదిగలు కత్తి గజ్జకట్టి ఊరేగింపుతో తమ వీధికి వచ్చినప్పుడు వారిని ఆడకుండా, జాతర జరగకుండా కలసికట్టుగా అటకాయించారు. ఒకరిపై ఒకరు కోపతాపాలతో అరచుకొనుట జరిగింది. గ్రామ పెద్దలు తీర్పుచేస్తూండేవారు. ఒకొక్కసారి ఘర్షణకు దిగి తగవులు పెట్టుకొనుట, కొట్లాట జరుగుతుండేది. పెద్దతరంపోయి, పెత్తనములో కొంత మార్పు కలుగుచున్నందున అంతరాయం ఏర్పడుచుండేది. అద్దంకివారు, భాగవతులవారు, దివివారు, టంగుటూరు తదితరులు నేర్పగా తీర్పు చేస్తూండే వారు.

అయినా బలిజలు వారి బజారులోకి మాదిగలు కత్తిపట్టి, గజ్జకట్టి, చేతి రుమాలుతో నాట్యము చేయుచు, అమ్మవారి ఊరేగింపురాగా, నాట్యం చేయకుండా నిలుపుదల చేసేవారు. ముందుకు సాగనిచ్చేవారు కాదు.

మాదిగలకు యీ ఊరేగింపులో చోటు లేకుండా చేయవలసినదిగా కేకలు వేసేవారు. పెద్దలు ఇదొక ఆచారమని చెప్పుచున్న మూర్ఖంగా వివేవారు కాదు.

**దీనికి కారణాలు :** ఎర్రగా బుర్రగా ఉండే ఎవరో మాదిగ కులస్థుడు, బలిజ కులస్థుల అమ్మాయిని లేపుకొనిపోయాడని, దానికి ప్రతి ఫలంగా వారు మా బజారుకు రావద్దని మొండిగా పట్టుదలగా ఎదురు తిరుగుట అలవాటయి పోయింది. ఆ సమయంలో బలిజ వీధిలో కత్తి గజ్జ నాట్యము ఆపి, సందడి లేకుండా కొంత దూరం ముందుకు పోయి, వీధి మలుపు తిరిగిన తర్వాత మరల యధాప్రకారంగా జాతర జరుగు చుండును. అయిన కక్ష సాధింపు చర్యగా ఇరు పక్షములవారు ఏదో రూపంగా చేనుకాడ, చెట్టుకాడ, గట్టుకాడ తగాదా పెట్టుకొని, తిట్టుకొనుట, కొట్టుకొనుట జరుగుచుండేది. తలలు పగిలేవి. కాళ్ళు చేతులు విరిగేవి. కేసులు పెట్టుకొనేవారు. పెద్దల వలన పరిష్కారంకాక, పోలీసులదాకా వెళ్ళేది. వారు కూడా అమ్మవారిమీద గల భక్తి విశ్వాసములను భయపెట్టి వదలి వేసేవారు. కొన్ని పెద్దలద్వారా పరిష్కారం చేసేవారు. అలా కూడా జరగనప్పుడు రంగ ప్రవేశం చేసి, తగాదాలకు మూలమైన వారిని, ముఖ్యులను కొందరిని అదుపులోకి తీసుకొనేవారు. జరిమానాలు విధించే వారు. జాతరలప్పుడు గొడవలు రాకుండా, ప్రమాదములు జరగకుండా కాపలాకు వస్తూండేవారు. గ్రామ పెద్దలైన కాపు, కరణం, మునసబ్ తదితరులతో కోర్టులో తీర్పు చెప్పించేవారు. అయిన మరల కేసులు పెట్టుకొని కోర్టు చుట్టూ తిరుగుట, వాయిదాలకు వెళ్ళుట జరుగుచుండేది.

**కోర్టు :** ఇలా 14-4-1923, ఒంగోలు మునసబ్ కోర్టు ఆర్. సి. నెం. 339/31 తే 12-8-1931 ప్రకారం జడ్జి విధించిన తీర్మానము ననుసరించి కొంతకాలంగా అమ్మవారి జాతరలు, కొలుపులు యిలా జరుగుచున్నవి. ఉల్కాముఖి వల్లూరమ్మ దేవత కొలుపులు లేక జాతరలు జరుపుకొనునప్పుడు మాదిగలు ఆచారము ప్రకారము కత్తి-గజ్జ కట్టుకొని, చేతి రుమాలుతో నాట్యము చేయుచూ, మేళ తాళములు తదితర వాయిద్యములతో ఊరేగింపుగా ఉత్సవం చేసుకొంటూ వస్తూ, బలిజలు గల వీధికి

ప్రవేశించేముందు ఉత్సవములు ఆపి, 5 గజముల దూరంలో అపి, బలి జల వీధి దాటి మలుపు తిరిగిన తర్వాత యథా ప్రకారం ఉత్సవములు ఊరేగింపు జరుపుకొనవచ్చును. ఈ ఉత్తర్వులు ఇరు పక్షముల అంగీకార ముల మధ్య గ్రామాధికారులకు అందచేశారు. అట్టి సందర్భములలో పోలీసుల సహకారము కూడా పొందవలసినదిగా ఆ ఉత్తర్వులలో సూచించారు.

పై ఉత్తర్వులు అతిక్రమించి ఎవరైనా విరుద్ధముగా ప్రవర్తించి నమ, గొడవలు, ఘర్షణలకు దిగినను, వారి యీనాములను రద్దు చేయు టయే గాక తగిన విధముగా శిక్షింప బడునను తెల్పియున్నారు. నిన్న మొన్నటికి వరకు గవర్నమెంటువారి ఉత్తర్వులకు లోబడి వేడుకలు జరుపు కొనుచున్నారు. అమ్మవారి జాతరలు బరుపుకొనునప్పుడు పోలీసు బందో బస్తు ఏర్పాటు చేయుట జరుగుచున్నది.

**అమ్మ దయ ఉంటే :** అన్ని ఉన్నట్లే యని కొన్ని విషయ ములు మన కర్మాను సారము జరుగుచుండును. కారణం అమ్మకు తెలి యక కాదు. దుర్మార్గం నశించుట మనకు వేదంలోనే ఉన్నది. అమ్మ యాజ్ఞికంగా అవతరించిన దేవత. సరస్వతీ, లక్ష్మి, పార్వతీల త్రియా త్మక స్వరూపం. దుర్గగా క్రోదాలను ఖండించి, లలితగా లాలిత్యం కరుణ, దయ కలిగిస్తుంది. భక్తులను కాపాడి తన వంతు కర్తవ్యాన్ని నెర వేర్చుతుంది.

**అమ్మ పేర స్థలము-పొలములు:** అద్దంకివారి ఆధ్వర్యంలోను, పోలూరివారి నిర్వహణలోను అటు మందపాటి రాజులు ఇటు వెంకటగిరి రాజులు అమ్మవారి నిత్య నైవేద్య ఉత్సవములకుగాను కొంత పొలమును ఇచ్చినట్లు తెలుస్తుంది. అంతేకాదు అద్దంకి వారు కూడా తమ ఆడపడచుగా అమ్మవారికి తనకున్న మాన్యంలో కొంత దానము చేసినట్లు కూడా పూర్వపు పెద్దలు చెప్పుట జరిగింది. ఈ పొలంలో వచ్చు ఆదాయముతో గ్రామ పెద్దలు, అర్చకత్వమునకు, ఇతర వృత్తుల వారికి పని పాటల నిమిత్తం కొంత జరుగుబాటు కలుగు నటుల ఏర్పాటు చేశారట. అమ్మ వారి గుడి దేవాదాయ శాఖవారి ఆధీనంలోకి వచ్చు వరకు అర్చకులే కొంత

ఫలసాయమును అనుభవించుట జరిగింది. తర్వాత మొదట ఇ.ఓ.గా వచ్చిన శ్రీ పి. పార్థసారధి (1971) అమ్మవారి భూములను కోర్టు ద్వారా స్వాధీనము చేసుకొనుట జరిగింది. తర్వాత 1973లో శ్రీ యడవల్లి ఘోషయ్య ఇ.ఓ.గా రావటం కొంత అభివృద్ధికి అవకాశం ఏర్పడింది. ప్రస్తుతం శ్రీ కోవి కోటేశ్వరరావు మరికొంత అభివృద్ధి చేయుటకు కృషి చేయుచున్నారు.

**శిలాభోగం స్థలాభోగం :** మొదట నుండి పవిత్రమైన ఉల్కాముఖి శ్రీ వల్లూరమ్మ సన్నిధికి చేరితే మనకు తెలియని ఆనందం-భక్తి భావం కలుగుతుంది. పాములకు, తేళ్ళకు నిలయమైన వల్లూరులోని స్థలం అమ్మవారి శిలాభోగం వలన వారం వారం పూజాది కార్యక్రమ నైవేద్యములు, వడపప్పు పానకంతో భక్తులు వచ్చి మొక్కుబడులు చెల్లించుకొనుట జరుగుచుండేది. కరువు కాటకములు ఏర్పడినప్పుడు అమ్మవారికి అద్దంకివారి ఆధ్వర్యంలో కొలుపులు- జాతరలు- పొంగళ్ళు చెల్లించుట, చుట్టుపట్ల గ్రామములవారు పంచాహ్నికంగా జరుగు ఐదు రోజుల వేడుకలలో పాల్గొనుట అమ్మవారి శిలాభోగానికి తార్కాణము.

దానికితోడు ఇరుప్రక్కల శ్రీ పోలేరమ్మ (ద) శ్రీ గంగమ్మ (ఉ) దేవళములు చేరుటచేత, ఆయా వంశములవారు కూడా ఆ చిన్న గుడులలోగల గ్రామ దేవతలను కొలుచుట-తలచుట వేడుకగా జరుగుచుండేది. ప్రథమ స్వాతంత్రోద్యమము తర్వాత బ్రిటీషు గవర్నమెంటు వారు దేవాలయ భూములను-స్థలములను అర్చకులు, పనిపాటలుచేసుకొనువారికి స్వంతంగా పట్టాలు ఇప్పించి, దానిలోగల ఫలసాయము పొందుటకు వీలు కల్పించారు. శ్రీ వల్లూరమ్మ పేరగల యీ భూములలోగల పంటలను వంతులువారిగా పంచుకొనుట జరుగుచుండేదట. ఏదైనా పేచీలు వచ్చినప్పుడు అద్దంకి కృష్ణయ్య, పిల్లుట్ల నరసింహ్వాయ్య, తూములూరి వీరరాఘవయ్య, టంగుటూరి కోదండరామమూర్తి, చదలవాడ పిచ్చయ్య, దివి రామానుజాచార్యులు, భాగవతులవారు, తదితర పెద్దలు పరిష్కరించేవారట.

వంశములలోని వారసులు మారేకొద్ది అమ్మవారి సన్నిధిలో కూడా

కొద్ది కొద్దిగా మార్పులు జరుగుతూ వస్తుంది. అమ్మవారిని ఆశ్రయించి తమ బాధలు తీర్చమని వేడుకున్నవారికి తగిన ఫలితము కలుగగా, వారు అమ్మపై భక్తి భావముతో కానుకలు సమర్పించేవారని సంబంధిత వ్యక్తులు చెప్పుకొనుచుండెడివారు. అంతేగాక తమ దీర్ఘ రోగములు అమ్మదయ వలన తొలగినవంటు మరికొందరు అమ్మవారి దేవళము చుట్టు గొడ్డూగోదా రాకుండా ముళ్ళకంచె, తదితర తీగలు నిర్మించారట. సంతానం కలిగిన వారు సంబరంతో ఊరేగుతూ, అమ్మవారి గుడిచుట్టు రాళ్ళు పరచుట జరిగిందట. ఇలా ప్రతి ఒక్కరికి అమ్మవారి దయవలన ఏదో ఒక ఉపయోగం, లాభం కలిగినందున ఉత్సవములు, వేడుకలు జరుపుటచేత అమ్మవారి మహిమలు ఇతర గ్రామాలవారికి కూడా తెలియుచున్నవి. వారు కూడా బండ్లు కట్టుకొని సకుటుంబంగా అమ్మవారి సన్నిధికి వచ్చి వేడుకలు జరుపుకొనిపోవుట జరుగుచున్నదట. అంతేకాకుండా ఇతర కులముల వారు మొక్కుబడిగా కోళ్ళు, వేటలు మొ॥ జంతు బలులను ప్రక్కన ఏర్పాటు చేసుకొని, పొంగళ్ళు పెట్టుకొని, తనవారికేకాక చుట్టుపట్ల వచ్చిన భక్తులకు కూడా అన్నం పెట్టుటచేత జనం-ధనం చేకూరుట జరుగుచున్నది.

**కుంకుమార్చన :-** మొదట ఎదుగు బొదుగులేని అర్చలుకూడా అమ్మవారికి రాబడి రావటం-భక్తులు పెరగటం- మహిమలు కలగటం చూచి, సంతోషించినవారై బద్దిపూడి వీరయ్య వీరి కుమారులు బంగారయ్య తదితరులు అద్దంకి వారి ఆధ్వర్యంలో కుంకుమార్చనలు జరిపించుటచేత అమ్మవారికి మరికొంత బలం చేకూరుట జరిగింది. దానికితోడు అమ్మవారు ఒంగోలుకు 5 కి.మీ. దూరంలో మద్రాసు-కలకత్తా జాతీయ రహదారిలో నుండుటచేత వచ్చేపోయే వాహనములవారు కూడా ఆపుకొని, అమ్మవారిని దర్శించి, కొబ్బరికాయలు, కానుకలు సమర్పించి పోవుచుండిరి. వారి కోరికలు తీరి విజయం కలుగుటచేత అమ్మవారిపై విశ్వాసంతో మరల మరల వచ్చి మొక్కుబడులు తీర్చుకొనుట జరుగుచున్నది. అంతేకాదు. పూర్వం వల్లూరులో నివసించినవారు కూడా అమ్మవారి మహిమలుతెలుసుకొని వచ్చి ఊరిని, అమ్మవారిని దర్శించి వెళ్ళుచుండిన సంఘటనలు

కూడా గలవు.

అలా వచ్చినవారిలో శ్రీ టంగుటూరి ప్రకాశం, అద్దంకి సూర్యనారాయణగారు, డా॥ రత్నాచారి తదితరులు చాలామంది ఉన్నారట.

**రాష్ట్ర ప్రభుత్వం-దేవాదాయ శాఖ :-** మన రాష్ట్ర ప్రభుత్వం వచ్చిన తర్వాత దేవాదాయ-ధర్మాదాయ శాఖలలో ఉన్న లోపాలను ఆయా ట్రస్టీల ద్వారా, దేవాలయ అర్చకుల ద్వారా తెలుసుకొని, కొన్ని ముఖ్యమైన దేవాలయములను ప్రభుత్వపరంగా స్వాధీనము చేసుకొని, వాటిని అభివృద్ధి చేయవలెనను సంకల్పము కలిగెను. పరిపాలన వ్యవహారములలోను, ఆర్థిక స్థితి గతులలోను ఏఏ దేవాలయములు ఎలా ఉన్నది తెలుసుకొని, ట్రస్టీల ద్వారా గ్రామ పెద్దల అనుమతితో దేవాదాయశాఖ వారికి అప్పగించుట జరిగింది. అట్టి దేవాలయములు కొన్ని కాలమాన పరిస్థితుల వలన అభివృద్ధి చెందుచున్నవి. ఇంకా చెందవలసియున్నది. అట్టి పరిస్థితులలో గ్రామ రాజకీయాలు, మనుషుల మనస్తత్వములననుసరించి ఉద్యోగరీత్యా అద్దంకి సూర్యనారాయణగారు తమ ఆధీనములోగల శ్రీ ఉల్కాముఖ—వల్లూరమ్మ దేవాలయమును ప్రభుత్వానికి అప్పగించుటకు అంగీకరించారు.



**ఆయన ఉదారత్వం :** తన స్వంత ఇంటిని ఇతరస్థలమును అమ్మవారికి అర్పించారు. వేడుకలు-జాతరలు జరుగునప్పుడు ఆ ఇంటినుండియే మొదట ప్రారంభం జరుగుచున్నది. దీనిలో పూజారులలో ఒకరైన బద్దిపూడి వంశజులు ఉంటున్నారు. అంతేకాక తన స్వంత పొలమును అమ్మి, దానిలో కొంత సుమారు పదివేల నూటపదహారులు (రు. 10,116/-) అమ్మ పేర ఒంగోలు ఆంధ్రాబ్యాంకులో పిక్సెడుచేసి, దానిపై వచ్చు వడ్డీని ప్రతి సం॥రం దసరా ఉత్సవములందు అమ్మవారికి వేడుకలు జరిపించవల

సినదిగా ఏర్పాటు చేశారు. దానికి పిల్లుట్ల రామజ్యోతులు, తూములూరి రామావధాని, (s/o) వీరరాఘవులు, మొదలి వెంకటేశ్వర్లు. s/o వెంకట సుబ్బయ్య, టంగుటూరి కోదండరామమూర్తి తదితరులున్నారు. ప్రస్తుతం పచ్చవ కుమారస్వామి మనుమడు నాగేశ్వరరావు (నాగు) చూస్తున్నట్లు తెలియుచున్నది. ఆరణీకం శ్రీ కోదండరామమూర్తి సహకారం తీసుకునేవారు.

ఈతముక్కల-మడనూరు జ్వాలాముఖి అమ్మవారలకుకూడ కొంత పొలమును-స్థలమును యిచ్చినట్లు ట్రస్టీలు మునసబ్ సా॥వెం॥ సుబ్బారెడ్డి, లింగారెడ్డి బాలిరెడ్డి, బొమ్మిరెడ్డి రామిరెడ్డి, కేసవరపు రామిరెడ్డి తదితరులు చెప్పుకొనుచుండిరి.

## స్థలాభోగం :

"బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వమరోగతా
అజాడ్యం వాక్పటుత్వంచ అమ నామస్మరణానే భవతే॥"

అమ్మ నామస్మరణ చేయుటవలన మనకు బుద్ధి (జ్ఞానం) బలం యశస్సు ధైర్యం, నిర్భయం సమస్త రోగములు తొలగుట, జడత్వం లేకుండుట, వాక్చాతుర్యం కలుగుట మొ॥ జరుగుచున్నవి. గత ముప్పది సం॥రా॥లు అమ్మవారి ప్రభావం నలుదిశలా వ్యాపిస్తుంది. శిలాభోగమే కాదు స్థలాభోగం కూడా కొంతవరకు కలిసివస్తుంది. అందువలన ఎక్కువ మంది భక్తులను అమ్మవారు రప్పించుకొనుచున్నది. పసుపు కుంకుమలతో, పట్టువస్త్రములతో నిత్యం పూజలు చేయించుకొనుచున్నది. కోరిన కోరికలు తీరుస్తుంది.

**అమ్మవారి సంకల్పం:** ఉండినచో సముద్రాన్ని భూమిగా, భూమిని పరమాణువుగా, గడ్డిపోచను వజ్రాయుధముగా, బీదవారిని భాగ్యవంతులుగా, బలహీనులను మనోధైర్యవంతులుగా, సకల ఐశ్వర్యములతో సంపదలను కలిగిస్తుంది.

"క్రియా సిద్ధిస్సత్వే భవతి మహతాం నోపకరణే"

అమ్మను నమ్ముకున్నవారికి అన్నీ సక్రమముగా జరుగుచున్నవి. అన్నీ ఒకవెత్తు అగస్త్యుడు ఒక ఎత్తు అన్నట్లు కొన్ని సంవత్సరములనుండి

యీ స్థలం ప్రాచుర్యం పొందుచున్నది. సాధువులు ఆగమశాస్త్రకోవిదులు అమ్మవారి శక్తిని రెండింతలు పెంచుటకు కార్యక్రమములు చేసియున్నారు. శ్రీచక్రయంత్రోద్ధారణము, అష్టదిగ్బంధనము ఆమె శక్తికి భక్తుల ముక్తికి ప్రమాణము. భక్తుల కోరికలు తీరుస్తూ, వారిపాలిట కల్పతరువుగా నిలుస్తుంది.

**దీనికి ఉదాహరణముగా**: మర్లపరప్పాడు నివాసి శ్రీ సుంకర కన్నారెడ్డిగారి భార్య సుబ్బమ్మ అమ్మవారివలన అనుకున్న కోరికలు నెరవేరుటచేత 1973లో పదివేల రూపాయలు విరాళముగా యిచ్చి, దేవాలయ కార్యనిర్వహణాధికారి శ్రీ యడపలి భూషయ్యగారి ద్వారా గుడిముందర ముఖమండపము నిర్మించుటకు సహాయపడినది.



కేరళీయుడు ఒంగోలు కొచ్చిన్ కేఫ్ అధినేత శ్రీ రామచంద్రన్ మురగన్‌గారు అమ్మవారి దయవలన సంతానము పొందుటచేత కొంత విరాళము ఇ.ఓ.గారికి అందజేసి, గుడికి కరెంటు వేయుటకు సహాయపడినారు.

సద్వినియోగము జరగవలసిన సమయము సంసిద్ధమైనప్పుడు మూలనున్న వస్తువులుకూడా ముంగిట చేరుతుందన్న నగ్నసత్యం అమ్మవారి దయవలన అన్నీ సమకూరుచున్నవి.

**కంచికామకోటి పీఠాధిపతి:-** శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీ స్వాములవారు యీ దారిని పోతూ, ఆగి అమ్మవారిని తిలకించి ఆమెను అష్టసిద్ధులు గలదిగా ఆశీర్వదించి వెళ్ళారు. శక్తిని పెంపొందింపచేశారు.

**సంపూర్ణ శతచండీ యాగము :** అర్చకులు, వల్లూరమ్మ ఆప్తులు శ్రీ బద్దెపూడి కృష్ణ, ఇ.ఓ శ్రీ యడ్లపల్లి భూషయ్య తదితర గ్రామ పెద్దల సహకారముతో ఉల్కాముఖి శ్రీవల్లూరమ్మ ఆశీస్సులు ప్రతిఒక్కరు పొందవలెనని, అందరు సుఖసంతోషములతో జీవించవలెనని శాంతి హోమము జరుపుటకు తగిన పనులు ప్రారంభించారు. ఉదారుల దగ్గర నుండి విరాళములు సేకరించారు. యాగమునకు కావలసిన సమస్త వస్తువులు సంపాదించారు. దీనికి కారంచేడు గురుకులు, మడనూరు చెంచు సుబ్బయ్య గురుకులు తదితరులు, హెచ్ నిడమానూరు హనుమంతరావు సిద్ధాంతి, అలయ అర్చకులు మహాయజ్ఞమును వేదపండితులు, ఆగమశాస్త్ర కోవిదులు 108ని రావించి కార్యక్రమమునకు ఉపక్రమించారు.

స్వస్తిశ్రీ రక్తాక్షి నామ సం॥ర జ్యేష్ఠ బహుళ దశమి భానువారం అనగా 24-6-84 మొదలు 29-6-84 వరకు అమ్మవారి దేవాలయ ప్రాంగణములో శాస్త్రోక్తంగా శత చండీ సంపూర్ణ మహాయాగం, సహస్ర ఘటాభిషేకం, లక్ష కుంకుమార్చన పూజలతో భక్తుల అభీష్టసిద్ధి ఫలప్రదమునకు కళ్యాణములు జరిపించారు.

**అన్నదానం :-** లేదనకుండా వచ్చిన భక్తులందరికీ సాయంత్రం వరకు నిత్యాన్నదానం జరిపించారు. సాయంత్రం గుడి ఉత్సవం వేడుకలు జరిపించారు. అమ్మవారి దయవలన అనుకున్న కోరికలు నెరవేరినవారు విరాళములు, గంటలు, గాజులు, పసుపు కుంకుమలు, తదితరములు అందించారు. భక్తుల రాకపోకలు పెరిగాయి. అమ్మవారివలన తమకు కలిగిన అనుభవములను ఇతరులకు చెప్పుకొనెడివారు. ప్రతిరోజూ గుడి ప్రదక్షిణలు చేసేవారు నిత్యం మనకు కనిపిస్తుంటారు.

**జీవనోపాధి :-** అమ్మవారి దయవలన కొన్ని వందలమంది బయట బంకులద్వారా, అంగళ్ళద్వారా యాత్రికులకు, భక్తులకు పూజాది కార్యక్రమాలకు కావలసిన వస్తువులు అమ్ముకొనుటయేగాక ఫలహార

శాలలు కూడా ఏర్పాటు చేసుకొని సుఖశాంతులతో జీవనము గడుపుకొను చున్నారు.

**ఆదాయం:-** అమ్మవారి ఆదాయము తక్కువగానుండు రోజులలో కూడా దేవాలయ నిర్వాహకులచేత కొబ్బరిచిప్పలు, ఇతర తిను బండార శాలలు, వస్తుసామాగ్రి షాపులద్వారా వేలంపాటలు పెట్టి, పోటీ దారుల ద్వారా సం॥రం పాటు తగు సదుపాయములు కల్పించి, వచ్చిన ఆదాయమును గుడి నిర్వహణ కార్యక్రమములకు ఉపయోగించు చున్నారు.

**విరాళములు** - అంతేకాదు. భక్తులు అమ్మవారివలన సహాయం పొంది, సంతోష సమయంలో విరాళములు, వివిధ రకములయిన వస్తు వాహనములు సమర్పించుకొనుచున్నారు. ఈ విధంగా శిలాభోగం - స్థలా భోగం ద్వారా అమ్మవారు అందరికీ అన్ని విధముల సహాయపడుతూ, ఇతర ప్రాంతములలోకూడా వాహన చోదకులద్వారా, భక్తులద్వారా విరాజిల్లుచున్నది. మహిమలు చూపుచున్నది. అమ్మవారిపై భక్తివిశ్వాసములతో వచ్చే యాత్రికులతో గుడి ఆవరణము చాలుటలేదు. భక్తులకు కొన్ని ఇబ్బందులు [illegible]. అందువలన దేవాలయ కార్యనిర్వాహణాధికారి శ్రీ యడవల్లి భూషయ్య యితర పెద్దల సహకారంతో, ఎండోమెంట్స్ పై అధికారుల ఆమోదము పొంది దేవాలయపునర్నిర్మాణము తదితర అభివృద్ధి కార్యక్రమములు చేబట్టుట [illegible]రిగింది. కొందరు దాతలను ప్రోత్సహించి అప్పటి సర్పంచి హనుమారెడ్డి, కోటయ్య, కోదండరామమూర్తి పంతులు,బద్దేపూడి కృష్ణ తదితరుల కృషివలనకూడా కొంత అభివృద్ధి కలుగుటకు అవకాశం ఏర్పడినది.



ఉదా:- ఈతముక్కల గ్రామనివాసి అప్పటి జిల్లా పరిషత్ చైర్మన్ శ్రీ కేసవరపు రామలింగారెడ్డి జి.యన్.టి. రోడ్ దగ్గర నుండి అమ్మవారి గర్భాలయంవరకు తారు రోడ్డు వేయించారు. అప్పట్లోనే

మరో దాత శ్రీ దామచర్ల ఆంజనేయులు పదివేలు విరాళము అందించారు.

దేవాదాయ ధర్మాదాయ చట్టం అమలులోకి వచ్చిన తర్వాత ఎండోమెంటువారు కష్టనష్టములు కలుగకుండా పలు అభివృద్ధి కార్యక్రమములు చేయుచున్నారు. 1. అమ్మవారికి పొంగళ్ళు పెట్టుకొనువారు ఎండకు, వానకు తడవకుండా 1988 ఇ. ఓ. శ్రీ భూషయ్యగారు షెడ్డుకు శంఖుస్థాపన చేయించారు. 17-5-92 యం. పి. శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి గారు ప్రారంభించారు. దీనివలన శైవాగమ పద్ధతి ప్రకారం అమ్మవారికి జరుగు పూజలకు ఆటంకం కలుగకుండా ప్రక్కన కోళ్ళు, మేకపోతులు, పొట్టేళ్ళు మొ॥ జంతుబలులను ఆచారం గలవారు నిర్వహించుకొనుచున్నారు. దీనినికూడా ప్రభుత్వంవారు నిషేధించుచున్నారు. అయినా ఆచారం కదా ప్రక్కన ఏర్పాటు చేసుకుంటామంటున్నారు.

భక్తులకు, యాత్రికులకు బ్రహ్మాండమైన వల్లూరు చెఱువు గలదు. అయినా దాతలద్వారా దేవాలయం తూర్పు దిశలో ఒక బావి త్రవ్వించారు. అమ్మవారివలన ప్రయోజనం పొందిన మరికొందరు మంచినీళ్ళ కుళాయిలు కూడా నిర్మించారు.

ముఖ్యమైనవారు వచ్చినప్పుడు ఒకింతసేపు వారుండుటకు 1993లో శ్రీ భూషయ్యగారు ఒంగోలు సహాయ కమీషనరు శ్రీ జి. అనంతనారాయణ, ఉపకార్య నిర్వహణ ఇంజనీరు శ్రీ ఎస్. వీర్రాజు అధ్వర్యంలో శంకుస్థాపన. 23-3-94 ఎస్. ఎన్. పాడు శాసనసభ్యులు శ్రీ జి. వి. శేషు ప్రారంభించారు. ప్రస్తుతం ఇ. ఓ. గారికి ఆఫీసు పనులకు కూడా ఉపయోగపడుతుంది. దేవాలయ నిర్వహణ పరిపాలన వ్యవహారములు చూచుటకు ధర్మకర్తల మండలిని కూడా ఏర్పాటు చేశారు. అప్పట్లో శ్రీ చుండి సోమిరెడ్డి ఇతర సభ్యులున్నారు. ప్రస్తుతం శ్రీ వల్లంరెడ్డి కోటిరెడ్డి ఛైర్మన్‌గా ఉన్నారు.

యాత్రికులు అక్కడక్కడా కూర్చొనుటకు, నీడనిచ్చు కొబ్బరి చెట్లు, అరుగులతో బండలు ఏర్పాటు చేశారు.

శ్రీ అద్దంకి సూర్యనారాయణ సహచరులు, విషయ పరిజ్ఞానం తెలి



సిన తరణీకులు శ్రీ టంగుటూరి కోదండ రామమూర్తి పంతులుగారు అమ్మవారి ఆదరణ, భక్తుల రాక గమనించి, అప్పటి సర్పంచి శ్రీ హనుమారెడ్డి, కోటయ్య తదితర గ్రామపెద్దలతో సంప్రదించి శ్రీ దామచర్ల ఆంజనేయులుగారి దృష్టికి తీసుకొనిపోవుట జరిగింది. వారుకూడా అమ్మవారిపై అభిమానంతో గుడి పునర్నిర్మాణం చేయుటకు తగిన కృషి చేయుచున్నారు.

**దేవాలయ జీర్ణోద్ధరణ-నూతన విగ్రహాల ప్రతిష్ఠ :** ఉల్కాముఖి శ్రీ వల్లూరమ్మ దేవాలయము భక్తులకు చాలుటలేదు. దానిని జీర్ణోద్ధరణచేసి, విశాలమైన ముఖమండపముతో సుందరంగా నిర్మించ వలసినదిగా పలువురు కృషి చేయుటచేత ఇ. ఒ. శ్రీ భూషయ్య అసిస్టెంటు కమీషనరు, శ్రీ జి. అనంతనారాయణ తదితరులు పై అధికారులతో సంప్రదించి దాతలనుండి కొంత విరాళము సేకరించటం, ఎండోమెంటువారి నుండి కామన్ గుడ్ ఫండు క్రింద మరికొంత ధనమును మంజూరు చేయుట జరిగింది.

**1993 :** అధికారుల, అర్చకుల, దాతల, గ్రామపెద్దల సహకారముతో పాతగుడిని పడగొట్టి, దాని స్థానములో విశాలమైన గర్భగుడిని విమాన గోపురములను పునర్నిర్మాణం జరిగింది. దీనికి ఆగమ వాచస్పతి, త్రిశతాధిక ప్రతిష్ఠాచార్య, శైవాగమ పండితుడు శ్రీ కారంచేటి పార్వతీశం గురుకులు, శ్రీ గూడల శేషయ్య గురుకులు, దేవాలయ అర్చకులు, వేదపండితులు ఇతర ఋత్విక్కులు తదితరుల నిర్వహణలో కార్యనిర్వహణాధికారి శ్రీ భూషయ్య, ధర్మకర్తలు, గ్రామపెద్దలు, భక్తుల సమక్షంలో శ్రీముఖనామ సం॥రం శ్రావణమాసం తే. 8-8-93 నుండి 12-8-93 వరకు శ్రీ వల్లూరమ్మ విగ్రహ పునర్నిర్మాణం, శ్రీ గణపతి(ద) శ్రీ సుబ్రహ్మణేశ్వర ప్రాణప్రతిష్ట, సింహవాహన ప్రతిష్ట, శిఖర కలశ

ప్రతిష్ట కార్యక్రమలు బ్రహ్మాండంగా జరిగాయి. శైవాగమ సిద్ధాంత ప్రకారం పంచాహ్నిక దీక్షతో మహాకుంభాభిషేక మహోత్సవము, శ్రీ దేవీ కుంకుమార్చన సామూహిక పూజలు భక్తి శ్రద్ధలతో భారీగా జరిపించారు. పూర్ణాహుతి జరిగిన తర్వాత భక్తులందరికి అన్నదానము ఏర్పాటు చేశారు. అనంతరం సాయంత్రం జరిగిన గుడి ఉత్సవం తర్వాత శాంతికొరకు పార్వతీ కళ్యాణం జరిపించారు. ఈ సందర్భంగా గత 5 రోజులు పొంగళ్ళు పెట్టుకొనువారు, మొక్కుబడులు తీర్చుకొనువారు, బండ్లుత్రిప్పుకొనువారు, ప్రదక్షిణము చేయువారు భక్తిశ్రద్ధలతో నిత్యం పూజ నైవేద్య ప్రసాదములు కావించుచున్నారు. శ్రీ అద్దంకి సూర్యనారాయణ ఇంటివద్ద నుండి అలంకరణలతో అమ్మవారి ఉత్సవం వేడుకగా ఊరేగుతూ గుడి వద్దకు రావటం జరిగింది.



**సంతాన వృక్షం :** అమ్మవారి గుడి కిరువైపుల గల యీ వేప చెట్టు మొదటనుండి మహిమలు కలిగియున్నది. పిల్లలు లేనివారు తమ చీరకొంగు చింపి చెట్టుకు వేలాడదీసి, దానిలో రాయిని పెట్టి ఊపుచుండుట.

చేత కొందరికి సంతానప్రాప్తి కలిగిందని తలంచి పూజలు చేయుదురు. ప్రదక్షిణలు చేయుచుందురు.

అలాగే ఉత్తర దిశలోగల నాగేంద్రుడికి కూడా పూజలు చేయుచుందురు. పాలు పోయుచుందురు.

**ముఖమండప నిర్మాణము :** శ్రీ ఉల్కాముఖి అమవారి గర్భాలయం నుండి తూర్పు దిశగా విశాలమైన ముఖమండపము కూడా భక్తులు విశ్రాంతిగా కూర్చొనుటకు వీలుగా అమ్మవారిని దర్శించుటకు నిర్మించారు. దీనికి నగదు రూపంలో ప్రముఖదాత తూర్పు నాయుపాలెం నివాసి శ్రీ దామచర్ల ఆంజనేయులు, సక్కుబాయమ్మ పేర 50 వేలు విరాళం అందించారు. ఒంగోలు ప్రముఖ సిమెంటు వ్యాపారి శ్రీ ఓ. వెం॥ సుబ్బారావు ప్రముఖ కంట్రాక్టరు శ్రీ బి. బాలయ్య కంకరరాయి ఉచితంగా సరఫరా చేశారు. ఈ ప్రయత్నమునకు ప్రధాన కారకులు శ్రీ టంగుటూరి కోదండ రామమూర్తి పంతులు, సర్పంచి హనుమారెడ్డి, అప్పటి ఇ.ఓ. శ్రీ భూషయ్య తదితరులు మాత్రమే. మరికొంత విరాళం గవర్నమెంటు ద్వారా రావటం వలన యీరోజు వందలమందీ భక్తులు అమ్మవారికి ఎదురుగా కూర్చొని, పూజలు, అభిషేకములు, వివాహాది పుణ్యకార్యములు జరిపించుకొనుచున్నారు.

**పోలేరమ్మ దేవత (దక్షిణం) :-** చల్లని తల్లి, కల్పవల్లి శ్రీ వల్లూరమ్మను దర్శించిన తర్వాత, తీర్థ ప్రసాదములు తీసుకొనిన వెంటనే దక్షిణంవైపుగల శ్రీ పోలేరమ్మ దేవతను కూడా చూడవలసియున్నది. ఈ గ్రామ దేవతకు పూర్వం నుంచి కొలువు చేయుటకు కుమ్మరులు వంశ పారంపర్యంగా వ్యవహరించుచున్నారు. ఈమెను కొందరు గణాచారులు మొదట అమ్మవారి ప్రక్కన ఏర్పాటు చేసుకొని, అద్దంకివారి సలహా మేరకు వడపప్పు, పానకం, పొంగళ్ళు చెల్లించుకొనుచుండెడివారట. ఈ చిన్న గుడిలో తలవంచుకొని చూసెడినంత పరిధిలో శిలారూపం కలిగి యుండెడిదట. మొదట ఆదాయము రాబడి తక్కువైనప్పటికి పోలేరమ్మకు సంబంధించిన దేవరులైన ఉప్పుటూరి వంశజులు ఆచారం ప్రకారం మొదట నుండి పూజాది కార్యక్రమములు నిర్వహిస్తున్నారు.

ఉప్పుటూరి వంశజులలో మొదట యలమంద ప్రధానకర్తగా ఉండేవాడట. ఈ యల్లమంద కొడుకులు, మనమలు, తమ్ముడి సంతానము అమ్మవారిని నమ్ముకొని నేటికీ జీవనము సాగిస్తున్నారు. వీరిలో యల్లమంద కొడుకులు రాఘవులు, ఉప్పుటూరి రమణయ్య, వెంకటేశ్వర్లు, వెంకటసుబ్బయ్య తదితరులు ఆరు నెలలు తర్వాత కలికివాయి వెంకటేశ్వర్లు, ఇనపదల వెంకటేశ్వర్లు తదితరులు మరో ఆరు నెలలు పూజాది కార్యక్రమములు నిర్వహించుకొనుచున్నారు. పోలేరమ్మకు ఆదాయం రాబడి తక్కువైనప్పటికి నమ్ముకొని జీవించుచున్నారు. పోలేరమ్మ దయవలన మేలు కలిగినవారు అమ్మవారికి చీర, రవిక, కానుకలు సమర్పించుకొనుట, మొక్కుబడిగా కోళ్ళు తదితర జంతు బలులు నిర్వహించుట జరుగుచున్నది. వర్షాలు లేక కరువు కాటకములు కలిగినప్పుడు పోలేరమ్మ దేవతకు సద్ది పెట్టుట సదాచారముగా వస్తున్నది. ఆచారము కలిగినవాళ్ళు పొంగళ్ళు పెట్టుకొనుచుందురు. శ్రీ పోలేరమ్మ దేవత సత్యంగల తల్లిగా, పిలిస్తే పలికే తల్లిగా శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్రలో వ్రాసియే ఉన్నది. వేశ్యలలో పతివ్రతకు మోక్షం ఇచ్చిన వైనం కూడ గలదు. ప్రతి గ్రామంలో గ్రామ దేవతగా వెలసి ఈతి బాధలు రాకుండా కాపాడుకలుగుతుంది. అమ్మవారి దర్శనము వలన కొన్ని శుభ కార్యములు జరిగినట్లుగా యిక్కడ పదుగురు ప్రత్యక్ష అనుభవమును చెప్పుకొనుచున్నారు.

**పోలేరమ్మ దేవాలయ పునర్నిర్మాణం :-** దాత లేకుండా ప్రభుత్వ ఆర్థిక సహాయంతో శ్రీ అమ్మవారి గర్భాలయం వెనుక వైపు ఇ.ఓ. శ్రీ భూషయ్యగారి ఆధ్వర్యంలో హైదరాబాదు దేవాదాయ శాఖ ఆదనపు కమీషనరు శ్రీ నర్రా నరసింహారావు ద్వారా 23-3-94 ఉ॥ 11-15 గం॥కు పునర్నిర్మాణ కార్యక్రమము జరిగింది. తర్వాత శ్రీ పోలేరమ్మ విగ్రహాన్ని దేవాలయంలో ప్రాణ ప్రతిష్ఠ చేయించి పూజాది కార్యక్రమములు నిర్వహించారు. మొదట నుండి అమ్మవారిని కనిపెట్టుకొనియున్న దేవరల్లను ఉప్పుటూరి వంశజులను దేవస్థానం వారే జీతములిచ్చి, వారి ద్వారా పూజాది కార్యక్రమములను చేయించుచున్నారు.



పొంగళ్ళు, జాతరలు జరుగు నప్పుడు జంతు బలులు అక్కడ జరగకుండా దేవస్థానంవారు కడు జాగ్రత్త వహించుచున్నారు. ఈ గుడుల దగ్గరకొచ్చు భక్తులకు ఎండ వాన తగలకుండా అమ్మవారిగర్భా లయం నుండి ఉత్తర దక్షిణములు కలుపుకొని పడమర కూడా విశాల మైన మండపమును నిర్మించారు. చుట్టూ గోడలకు పై భాగమున మెస్ కూడా ఏర్పాటు చేశారు.

**గంగమ్మ తల్లి (ఉత్తరం):-** శ్రీ పోలేరమ్మ దేవత దగ్గర తీర్థ ప్రసాదములు తీసుకొని ఉత్తరం వైపు ముందుకు పోతే గంగమ్మ తల్లి దేవళం కన్పిస్తుంది. పూజారి భక్తుల రాక కొరకు ఎదురు చూస్తుంటాడు. ఈమెకు పూర్వం నుండి వంశపారంపర్యంగా యాదవులు కొలువుచేస్తు న్నారు. వారిలో మొదట నుండి నక్కా వంశజులు పూజారులు. మొదట నుండి భక్తులు సమర్పించు కానుకలే వీరికి జీవనాధారము. శ్రీ పోలేరమ్మ దేవతవలె యాదవులు కూడా వేడుకలు సంబరములు జరుపుకొనుటకు గంగమ్మ శిలను యిక్కడ మొదట అద్దంకివారి అనుమతితో ఏర్పాటు చేసుకున్నట్లు కొందరు పూర్వీకులు చెప్పుకొనుచుందురు. అప్పటినుండి ఉల్కాముఖి అమ్మవారి కొలుపులు జాతరలు జరుగుచున్నప్పుడు వీరు కూడా గంగమ్మ తల్లికి వేడుకలు జరుపుకొనుచుందురు. ఈ వంశంలోని వారేగాక గంగమ్మ తల్లిని కొలిచే గణాచారులుగాని దేవరలు గాని పూనిక వచ్చినప్పుడు అమ్మవారి వాక్కు తెలుసుకొని తదనుగుణముగా కార్య క్రమములు, పూజలు నిర్వహించెదరు.

వర్షములు లేనప్పుడు, రానప్పుడు అదును చూచి గంగమ్మ తల్లికి విగ్రహం మునిగేంత వరకు గడపల వరకు నీళ్ళుపోసి, తర్వాత అమ్మను

పసుపు కుంకుమలతో పూజించి, సద్ది వడపప్పు పానకములు వేడుకగా జరిపించినచో వర్షములు తప్పక పడుచుండేవని పెద్దలు చెప్పుకొను చుందురు. మొక్కుబడులు గలవారు బయట యీ తల్లికి కోళ్ళు తదితర జంతు బలిలిచ్చి తృప్తి పరచెడివారట. తర్వాత పొంగళ్ళు నైవేద్యం పెట్టిన అనుకున్న కోరికలు నెరవేరేయని యీ వంశజులలో మొదట నక్కా కోటయ్య తదితరులు చెప్పుకొను చుండెడివారు. దయగల తల్లి గంగమ్మ యని వారి నమ్మకం.

ఉదా : శ్రీ కోటయ్య కొడుకు కోటేశ్వరరావు అమ్మవారిని నమ్ముకొని భక్తిశ్రద్ధలతో కొలుచుటచేత కొంతకాలం తర్వాత పోలీసు ఉద్యోగం వచ్చింది. తర్వాత తమ్ముడు నక్కా నారాయణ అమ్మ వారిని నమ్ముకొని పూజాది కార్యక్రమములు చేయుచున్నాడు. వచ్చిన భక్తులకు అమ్మవారి పూజారి కార్యక్రమములు నిర్వర్తించుచూ, కొంతకాలం జరిగిన తర్వాత వారికి కూడా పోలీసు ఉద్యోగం అమ్మవారి దయవలన లభించింది. ప్రస్తుతం శ్రీ నక్కా జయశంకర్ గంగమ్మ తల్లిని నమ్ముకొనియున్నాడు. భక్తుల కానుకలే తప్ప ఎదుగు బొదుగులేని జీవనాదారము కలిగి యున్నాడు.

ఎండోమెంట్సువారు ఇ.ఓ. శ్రీ భూషయ్యగారి ఆధ్వర్యంలో యీ



చిన్న గుడినికూడా తొలగించి, దాని స్థానంలో గుంటూరు దేవాదాయశాఖ ఉప కమీషనరు శ్రీ జి. కేశవులుద్వారా 23-3-94 శ్రీ గంగమ్మతల్లికి దేవాలయపు పునర్నిర్మాణ కార్యక్రమము చేయించారు. గుడి నిర్మాణము పూర్తి అయిన తర్వాత శ్రీ భూషయ్య ధర్మకర్తల మండలి ఛైర్మన్ నుండి సోమిరెడ్డి తదితర సభ్యులుఆలయఅర్చకులు

పెద్దలసహాకారముతో శ్రీ గంగమ్మ తల్లి విగ్రహ ప్రాణ ప్రతిష్ఠ పూజాది కార్యక్రమములను నిర్వహించారు. చాలీ చాలని ఆదాయముతో జీవనము సాగించుచున్న నక్కా వంశజులకు పూజారులుగా దేవస్థానం వారే జీత ములు ఏర్పాటు చేసి, విధి నిర్వహణలో జాగరూకులై యుండులాగున చూస్తున్నారు. ఈ గుడికి కూడా విశాలమైన మండపము కలిగియుండుట చేత భక్తులకు ఇబ్బంది లేకుండా పూజలు చేయించుకొని ఆనందంగా పోవుచున్నారు.

**కుల మతాలకు అతీతంగా :-** అన్ని వర్ణముల, వర్గముల వారు తర తమ భేదము పాటించక ఉల్కాముఖి అమ్మవారి దర్శనం అనం తరం శ్రీ పోలేరమ్మ, శ్రీ గంగమ్మ దర్శనం చేసుకొనుట, వారి వారి బాధలు, కోరికలు తలచుకొనుట, అవి నివారణ జరిగినప్పుడు వారికి తోచిన విధంగా శక్త్యానుసారము అమ్మవారలకు కానుకలు, ఇతర వస్తు వులు అందజేయుట జరుగుచున్నది. కోరికలు తీర్చే తల్లిగా, ఆపదలు బాపే కల్పవల్లిగా పదుగురుచేత సకల సదుపాయములు కలిగించు కొను చున్నది.

ఉదా :- వెండి తీర్థపు గిన్నెలు, వెండి పళ్ళెరములు, వెండి కుంకుమ బరిణెలు, వెండి-ఇత్తడి పెద్ద కుందులు, వెండి త్రిశూలము, వెండి అష్టదళలక్షి పళ్ళెములు, వెండి ఖడ్గము, వెండి శఠారి, వెండి సింహ తలాటము, వెండి కిరీటం, వెండి హస్తములు, వెండి కర్ణ పత్రములు, కుడివైపు డమరకం గల వెండి హస్తము, వెండి వడ్డాణము, వెండి మకర తోరణములు తదితరములు విరాళముగా అందించారు.

**స్టీలు హుండీలు :-** భక్తులు అమ్మవారికి ఇచ్చే కానుకలు,విరాళ ములు భక్తి శ్రద్ధలతో గర్భగుడి దగ్గర గల పెద్ద స్టీలు హుండీలో వేయ వచ్చు లేదా ఇతర చోట్లగల ఇనుప హుండీలలో కూడా వేయవచ్చును. వీటిని ఆలయ నిర్వహణమునకు ఉపయోగించగలరు. మనం వేసిన దానం పదిమందికి మేలు కలుగుతుంది. సకల సౌకర్యములు చేయుటకు వీలు కలుగుతుంది.

**అమ్మ దయ ఉంటే అన్ని ఉన్నట్లే :-** అనే నానుడితో

కొందరు అమ్మవారికి, భక్తులకు సదుపాయములు కలుగ చేయుచున్నారు. ప్రముఖ వాణిజ్యవేత్త విద్యాదాత తూర్పు నాయుడుపాలెం నివాసి, దేవాదాయ మంత్రివర్యులు శ్రీ దామర్ల ఆంజనేయులు సక్కుబాయమ్మలు ముఖ మండమునకు సుమారు 50 (యాభై) వేలు విరాళం అందించి 1994లో నిర్మించుటకు కృషి చేశారు.

2) శ్రీ నర్రా ఈశ్వరరెడ్డి, విజయలక్ష్మి (నెల్లూరు) గర్భాలయము నకు గ్రానైట్ బిగించిన నిర్మాణ దాతలు.

3) శ్రీ కోటంరెడ్డి సీతారెడ్డి, సుకన్య గర్భగుడి ముఖ మండపము చుట్టూ గల కాంపౌంకు టైల్స్ (నెల్లూరు) బిగించారు.



**ప్రహరిగోడ :-** ప్రస్తుతం కార్యనిర్వాహణాధికారి శ్రీ కోయి కోటేశ్వరరావుగారి ఆధ్వర్యంలో గుడికి చుట్టు పరిసర ప్రాంతంలో పశువులు తదితరములు రాకుండా ప్రహరిగోడ ఏర్పాటు చేశారు.

భక్తుల రద్దీ పెరిగి, యాత్రికులు ఉండుటకు తగినవసతి లేనందున పై అధికారుల అనుమతితో విశ్రాంతి భవనమునకు 1998లో శంఖుస్థాపన చేయించారు. భవనమును ప్రారంభించి విశ్రాంతికలిగించుటకు వీలు కల్పిస్తున్నారు. ఈ వసతిభవనంలోగల వారికి, ఇతర భక్తులకు నీటి సౌకర్యము కలిగించుటకు 1999లో శ్రీ కోటేశ్వరరావు, తన్నీరు వెంకటేశ్వర్లు (పెరిదేపి) కుంచాల రమణయ్య, తన్నీరు చి॥ వెం॥, పల్లెపు రాఘవులు, శ్రీ సిద్దవరపు మదుసూదనరెడ్డి, మన్నే సురేష్‌కుమార్ తదితరులతో రు. 10 వేల రూ॥ల చొ॥న విరాళములు అందించి బావి త్రవ్వించారు. ఈ నీరు అన్నిట అందరికి ఉపయోగం.

**సింహద్వారం :-** వల్లూరు నివాసి శ్రీ తన్నీరు కోటయ్య, వెంకటేశ్వర్లు తదితరుల ఆధ్వర్యంలో వడ్డెర సంఘంవారు అమ్మవారిపై గల భక్తివిశ్వాసములతో జి.ఎన్.టి. రోడ్డుకు దగ్గరగా సుందరమైన సింహద్వారం నిర్మించి ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ బెల్లం కోటయ్య

ద్వారా ప్రారంభించారు.

దానికి దక్షిణంగా అంగళ్ళు పెట్టుకొని వ్యాపారము చేసుకొను నిమిత్తం ఇ.ఓ.గారు శ్రీ దామచర్ల, బెజవాడ వెంకటేశ్వర్లుగారి ఆధ్వర్యంలో 25-4-99న ఎస్.ఎస్. పాడు శాసనసభ్యుడు (జి॥ ప॥ ఛైర్మన్) శ్రీ పాలపర్తి డేవిడ్‌రాజు ద్వారా శంఖుస్థాపన చేయించి, యీ కొట్ల సముదాయమును ప్రారంభించాలని పలువురు సూచించుచున్నారు.

పొంగళ్ళు పెట్టుకొనువారికి ఇబ్బందిలేకుండా మరొక షెడ్డును శ్రీ పంగులూరి పెద్దరామయ్య దాతృత్వంలో 1998లో నిర్మించి, శ్రీ తాటిపర్తి సుబ్బారెడ్డిగారి ద్వారా ప్రారంభించారు.

ముఖమండపములో పాలరాయి పరుచుటకుగాను రు. 1116/-లు చొ॥న నగదురూపంలో విరాళమిచ్చిన (1-78) దాతలు గలరు.

అమ్మవారి గర్భాలయంలో గ్రానైట్‌రాయి పరచుటకు రు1116/-లు నగదురూపంలో విరాళమిచ్చిన (1-19) దాతలు గలరు. బయట ఆవరణలో ఇప్పటి సింహద్వారం వరకు రాళ్ళు పరచుటకు అనేకమంది నగదు రూపంలో విరాళములు అందించుచున్నారు. ఇదంతా ఒకరు చెప్పితే జరుగుచున్న కార్యముకాదు. అమ్మవారి వలన సహాయం పొందినవారు సంతోషంగా చేస్తున్న వితరణము. ప్రదక్షిణ మండపమునకు ఇనుప మెస్ ఇతర సౌకర్యములు కలిగించుచున్నారు. భక్తులు క్యూలో వచ్చి ఇబ్బందులు పడకుండా అమ్మవారి దర్శనం చేసుకొని వెళ్ళుటకు వీలు కల్పించుచున్నారు.

**ఉత్సవ విగ్రహములు :-** అమ్మవారి అనుగ్రహం పొందుటకు ప్రతి శుక్ర-ఆదివారములు గుడితరపున ప్రసాద వినియోగం. ప్రతి శుక్రవారం సా॥ 7 గం॥ గుడి ఉత్సవం భక్తులతో, భజంత్రీలతో, అర్చకుల వేదమంత్రోచ్చారణతో బ్రహ్మాండంగా జరుగుతుంది. మొదట ఉన్న ఉత్సవ విగ్రహంగాక, రెండవ ఉత్సవ విగ్రహమును మూలవరుల రీతిలో హైదరాబాదు రిటైర్డు రైల్వే ఉద్యోగి శ్రీ ఉమ్మేశ్వరరావు అమ్మవారిపై భక్తి శ్రద్ధలతో అందించారు.

**సింహవాహనములు :-** అమ్మవారు అవకాశం ఉన్నప్పుడు

ఊరేగుటకుగాను ఇత్తడి, వెండి వాహనములు గలవు. అమ్మవారికి సర్వవ పొప్పరం, పీఠం తదితర వస్తువులు దేవస్థానం ద్వారేకాదు, దాతలు కూడా ముందుకువచ్చి చేయించుచున్నారు. ఇదంతా అమ్మవారి అనుగ్రహము వల్ల ననే జరుగుచున్న పని మాత్రమే.

**అన్నదానం మరొక సంకల్పం :-** అన్నదానమునకు మించిన మరొక దానంలేదని శాస్త్రం చెప్పుతుంది. ధనం ఎంత ఇచ్చిన మానవుడికి తృప్తి ఉండదు. మరికొంత ఇస్తే బాగుండు అనే కోరిక కలుగుతుంది. కాని కడుపునిండా అన్నం తిన్నవాడు "ఇక చాలమ్మా కడుపు నిండింది యని సంతోషపడి పెట్టినవాడిని" అన్నదాత సుఖీభవ, అని దీవించి విశ్రాంతి తీసుకొని వెళ్తుంటారు. అన్నం పరబ్రహ్మ స్వరూపం. ప్రస్తుత కార్యనిర్వహణాధికారి శ్రీ కోయి కోటేశ్వరరావు అన్నదాన విషయంలో శ్రద్ధవహించి, దాతలనుండి విరాళములు సేకరించుటయేగాక, అన్నదాన సత్రం నిర్మించి, అందు నియమించిన కమిటీద్వారా వారమునకు గాని, మాసమునకుగాని ఒకరోజు సాధువులకు, బీదలకు అన్నదానము చేయవలె నని సంకల్పం కలిగింది. ఇది కార్యరూపం దాల్చినచో యిక్కడ అమ్మ వారి సన్నిధిలో భక్తులతో సందడిగా సమారాధన జరుగుచుండును. ఇందుకు స్పందించి కొందరు దాతలు విరాళములు అందించారు.

1) బ్రహ్మశ్రీ. శే. జి. వెం॥ సు॥ శాస్త్రి జ్ఞా శ్రీ సూర్యనారాయణశర్మ, వల్లూరు రు 1116-00
2) శ్రీ సాతులూరి సత్యన్నారాయణ ఉప్పుగుం- రు 1116-00
3) శ్రీ ఏలూరి వెంకటేశ్వర్లు-సుజాత ఒంగోలు రు 1116-00
4) శ్రీ జి. చంద్రమౌళి-లక్ష్మి-కందులూరు రు 1116-00
5) శ్రీ గొల్లపూడి శ్రీరాములు-వల్లూరు రు 1116-00
6) శ్రీ వారణాశి నటరాజేశ్వరులు-ఎర్రబాలెం రు 1116-00
7) శ్రీ మోపర్తి పున్నయ్య డాక్టర్-మేదరమెట్ల రు 1116-00
8) శ్రీ గంగిశెట్టి నరసింహారావు & సన్స్ మద్దిపాడు రు 1116-00
9) శ్రీ ఆలపాటి సీతారామయ్య-మంగతాయారు ఒంగోలు రు 1116-00

**చేయవలసిన అభివృద్ధి కార్యక్రమములు :-**

**1) స్త్రీలకు స్నానాల గదులు :-** కొందరు స్త్రీలు బావి దగ్గర లేక చెఱువులో బహిరంగ స్నానములు చేయుట ఇబ్బందికరముగా ఉన్నది. అటువంటివారికి ప్రత్యేకంగా నీటివాలుని చూచి స్నానపుగదులు ఏర్పాటు చేయవలసి యున్నది.

**2) బలిహారస్థూపం :-** ప్రస్తుతం అక్కడక్కడ జంతుబలులు జరుగుచున్నవి. శైవాగమ పద్ధతికి ఇది విరుద్ధము. కావున విశ్రాంతి భవనమునకు ముందు గల కలవర్టు దారికి దగ్గరలో త్రిశూలాకారం ఇరువైపుల పోలేరమ్మ, గంగమ్మ శిలలతో మహాస్థూపం నిర్మించి, దేవతల ఆచారము ప్రకారం దానిచుట్టు కోళ్ళు ఇతర జంతువులను త్రిప్పుకొని బలిహారం జరుపుకొనునట్లు ఏర్పాటు చేయవలసినదేగాని, యాగ్నికం నుండి అవతరించిన శక్తిస్వరూపిణి అయిన అమ్మవారి దగ్గర జరగకూడదు. కారణం అక్కడ పూజలు శైవాగమ పద్ధతి ప్రకారం మొదటనుండి అర్చకత్వం ద్వారా నిర్వహింపబడుతుంది.

**విశేష పూజలు :-** ఉల్కాముఖి శ్రీ వల్లూరమ్మ దగ్గర ప్రతి నిత్యం జరిగే పూజలేగాక, ప్రతి సం॥రం పర్వదినాలలో విశేషపూజలు కూడా జరిపించటం భక్తిశ్రద్ధలకు ఉదాహరణలు. 1) నూతన సం॥రం సంక్రాంతి సందర్భంగా భక్తుల రాకతో పూజలు, అభిషేకములు తదితరములు ఎక్కువగా జరుగుచుండును. కనుమ పండుగరోజు దేవరలు మొక్కుబడులు తీర్చుకొనుట, పొంగళ్ళు పెట్టుకొనుట, ప్రదక్షిణలు తదితరములు చేయించుకుందురు.

తెప్పోత్సవం :- సాయంత్రం సోమశేఖరుడు పర్వతవర్థనమ జ్వాలాముఖి అమ్మవారలను 2) రుక్మిణి, సత్యభామా సమేత శ్రీ వేణుగోపాలస్వామి ఉత్సవ విగ్రహములు 3) ఉల్కాముఖి శ్రీ వల్లూరమ్మ ఉత్సవ విగ్రహములు ఆయా ప్రదేశముల నుండి బండ్లపై ట్రాక్టరులపై ఊరేగింపుగా మేళతాళములతో ఆనందంగా వల్లూరు చెఱువు దగ్గరకు చేరుకొని, కనులపండుగలా తెప్పోత్సవం భక్తిశ్రద్ధలతో జరుగును. దీనిని చూచుటకు పరిసర గ్రామాలవారు కూడా ఎక్కువ సంఖ్యలో పాల్గొనె

చరు. శివరాత్రి సందర్భంగా అమ్మవారి సమక్షంలో జాగారం చేయువారు, నామస్మరణ పాడువారు మిక్కుటముగా కన్పించుచుందురు.

ఉగాది పర్వదినమున ఇ.ఓ గారి ఆధ్వర్యంలో భీష్మాచార్యులవంటి బద్దిపూడి కృష్ణ, సోమరాజుపల్లి నాగేశ్వరరావులాంటి యువ అర్చకులు భక్తులకు విశేష పూజలు జరిపించుటయేగాక, చక్కగా పంచాంగ శ్రవణం విన్పించుచుందురు. శ్రీవల్లూరమ్మ పేర పంచాంగ పుస్తకములు ప్రచురించి ముఖ్యమైనవారికి అందించుట విశేషం. ఉగాది పచ్చడి ప్రసాదం ఆరోగ్యమునకు అమృతఫలం లాంటిది. వినాయకచవితి వేడుకలు భక్తుల రాక విశేషములు చూడవలసినదే.

శ్రావణమాసంలో శ్రీవరలక్ష్మి పూజలు, వ్రతమును ఇ.ఓ. గారి ఆధ్వర్యంలో బద్దెపూడి కృష్ణ, నాగేశ్వరరావు, విశ్వం తదితర అర్చకులు భక్తిశ్రద్ధలతో వేడుకగా చేయుచుండును. ఈ అష్టలక్ష్మి పూజలు శ్రావణ మంగళ-శుక్రవారములు జరిగిన దోషములు తొలగి సకల కోరికలు సిద్ధించగలవు. అమ్మ దయవలన అందరు రాగలుగుచున్నారు. దీపావళికి ప్రతి పుణ్యస్త్రీ వచ్చి అఖండ దీపారాధన జరిపించుకొనవచ్చును. కార్తీక మాసంలో లక్ష్మిపూజ, గౌరీవ్రతం కార్తీక స్నానములుచేసి, నిండు మనస్సుతో, భక్తిభావంతో ప్రదక్షిణలు చేయుచుందురు. అనేక వస్తువాహనములు భక్తితో సమర్పించుచున్నారు. త్రిమూర్తి శక్తి స్వరూపిణినిగా ప్రసిద్ధి.

**దసరా ఉత్సవములు:** ఆశ్వీయుజమాసంలో దేవి నవరాత్రులు ఇక్కడ బ్రహ్మాండంగా జరుగును. ఈ తొమ్మిదిరోజులు అమ్మవారిని తొమ్మిది అవతారములతో 1) స్వర్ణకవచ కనకదుర్గ 4) మహాలక్ష్మి 3) గాయత్రీ 4) అన్నపూర్ణ 5) లలితత్రిపురసుందరి 6) బాలత్రిపురసుందరి 7) సరస్వతీ 8) దుర్గ 9) రాజరాజేశ్వరీలుగా అలంకరించి ఉత్సవములు వేడుకలు జరుగుచుండును. మహిషాసురమర్దినీ అమ్మవారి ఉగ్రరూపమునకు ప్రతీక. ప్రముఖులను ఆహ్వానించి, సుందరకాండ, లలిత సహస్రనామార్చనలు చేయుచుందురు. చండీపారాయణం చేయుట విశేషము. నవమిరోజు వస్తువాహనములకు ఆయుధపూజ భక్తులు చేయించుకొనుచుందురు. దశమిరోజు భక్తుల రాకతో అభిషేకములు, అర్చనలు, ఇతర

వేడుకలు గుడి ఉత్సవములు చూచుటకు కన్నుల పండుగలా నుండును.

**ఆలయ సిబ్బంది:-** అనాదిగా అర్చకత్వం ఆధీనంలో నడుస్తున్న యీ దేవాలయాన్ని అధికారికంగా స్వాధీనం చేసుకున్న ఎండోమెంట్స్ కార్యనిర్వహణాధికారులు శ్రీ పి. పార్థసారధి, శ్రీ భూషయ్య, తదితరుల నుండి నేటి శ్రీ కోయి కోటేశ్వరరావు వరకు పై అధికారుల అనుమతికి లోబడి ప్రతినిత్యం పూజాది కార్యక్రమములేగాక, భక్తులకు సకల సదుపాయములు కలిగిస్తున్నారు. ఇ.ఓ.గారి ఆధ్వర్యంతో భక్తులకు ఎటువంటి ఇబ్బందులు కలుగకుండా శ్రీ కొత్తపల్లి నాగేశ్వరరావు, సాంబశివరావు, చావలి వెంకటేశ్వర్లు, మార్కాపురం వెంకటేశ్వర్లు, పసుపులేటి సుబ్బారావు, పెండ్యాల వెంకటేశ్వర్లు, స్వీపరు పొట్లూరి ఆదిలక్ష్మమ్మ, వాచ్ మన్ శ్రీనివాసరావు, నాగేంద్రమ్మ తదితరులు ప్రతినిత్యం జాగరూకులై అమ్మవారి సన్నిధిలో ఎవరి డ్యూటీ వారు ఆనందంగా చేయుచుండుట విశేషము.

**పూజారులు :-** ప్రారంభంనుండి శ్రీ అద్దంకివారి ఆధ్వర్యంలో బోదానందసూత్ర కాశ్యపగోత్రీకులు త్రయాఋషి వంశీయులు శ్రీ ఉల్కాముఖి-వల్లూరమ్మ దేవాలయమునకు వంశపారంపర్యంగా శైవాగమపద్ధతిలో అర్చకత్వం ఆచరించుచున్నారు. అమ్మవారి పొలంలో కొంత అనుభవిస్తూ, నిత్యపూజాది, అర్చన కార్యక్రమములకు మరికొంత వినియోగిస్తూ, భక్తి శ్రద్ధలతో అమ్మవారిని ఆశ్రయించుకొని యున్నారు.

దేవాదాయశాఖవారి ఆధీనంలోకి వచ్చిన తర్వాతకూడ వారి వంతుల వారిగా విధి నిర్వహణలో ఎట్టి లోపములు లేకుండా, భక్తులకు ఇబ్బందులు కలుగకుండా పూజాది కార్యక్రమములు నిర్వహించుచున్నారు. వారిలో భీష్మాచార్యుల వంటి శ్రీ బద్దిపూడి కృష్ణ, బంగారయ్య కుమారుడు శ్రీ విశ్వేశ్వరరావు, చురుకుతనం కలిగిన శ్రీ సోమరాజుపల్లి నాగేశ్వరరావు, దేవరపాలెపు వెంకటరమణారావు తదితరులకు భక్తులకు భగవంతునకు (అమ్మ దయకు) మధ్య సంధానకర్తగా వ్యవహరించుచున్నారు. మునుముందు ఇ.ఓ. గారి ఆధ్వర్యంలో దేవాలయ అభివృద్ధికి భక్తులరాకకు విశేషంగా కృషి చేస్తారని కోరుకుంటున్నారు.

**అమ్మవారి దర్శన వేళలు :-**

ఉ॥ 6 గం॥ నుండి 1 గం॥వరకు మధ్యాహ్నం 1-30 గం॥ నుండి రాత్రి 8 గం॥ వరకు

ఆదివారం ఉ॥ 6 గం॥ నుండి 12 గం॥ వరకు మధ్యాహ్నం 2-10 గం॥ నుండి రాత్రి 8 గం॥ వరకు

**పూజ సమయం :**

అభిషేకములు ఉ॥ 6 గం॥ నుండి రాత్రి 7 గం॥ వరకు

అష్టోత్తర పూజ ఉ॥ 7 గం॥ నుండి 1 గం॥వరకు మధ్యాహ్నం 2 గం॥ నుండి రాత్రి 8 గం॥

సహస్రనామపూజ ఉ. 6-30 గం॥ 7 గం॥ సా. 6-30 నుండి 7-30 వరకు

నిత్య వాహనపూజ ఉ. 7 గం॥ నుండి రాత్రి 7 గం॥ వరకు

**అమ్మవారి చరిత్ర :-** శ్రీ వల్లూరమ్మ ఉల్కాముఖి చరిత్ర పుస్తకము ముఖ మండపము ఉత్తరదిశ ద్వారము దగ్గర గల ఆఫీసు సిబ్బంది దగ్గర గలదు. మరియు సింహద్వారం దక్షిణం మొదట బంకు యజమాని చిరుమామిళ్ళ సుబ్బారావు, వారి మరదలు సుబ్బమ్మ దగ్గర తక్కువ రేటుకు అమ్మబడుచున్నవి. గత 300 సం॥ల నాటి చరిత్రను తెలుసుకొనుటయేగాక సుప్రభాతం, అష్టోత్తరములు, భజన పాటలు, మంగళ హారతులు ప్రతినిత్యం ఇంటివద్ద కూడా స్మరించుకొనుటకు చక్కగా ఉపయోగపడగలదు.

**ఆహ్వానం :-** భక్తులారా రండీ, ఉల్కాముఖి శ్రీ వల్లూరమ్మను దర్శించండి, సుఖశాంతులు, అష్టైశ్వర్యములు పొందండి.

ప్రాణప్రతిష్ట చేసిన గుడిలో దేవతా విగ్రహమునకు అర్చకులే ఉ॥ షోడశోపచార పూజలు చేయుదురు. అమ్మవారి నామరూపముల ననుసరించి 16 రకములుగా సేవించుట, అలాగాక మందిరంలోగాని మన ఇంట్లోగాని పటము పెట్టుకొని పూజలు నిర్వహించుకొనవచ్చు. కలశమునకు రాగిలేక ఇత్తడి చెంబులో మామిడాకు లుంచి, దానిపై కొబ్బరికాయ, దానికి రంగు గల రవికచుట్టి, పుష్పగంధ అక్షితలతో కలశమును బియ్యంపై పెట్టి

షల్తైను. తమల్లపాకున్నై పసుపుతో గణపతిగా నుంచుము. పూజకు కావలసినవి :- కొబ్బరికాయలు, గ్లాస్సు, ఉద్ధరిణి, స్పూన్స్ దీపారాధన కుందులు, వత్తులు, నూనె, స్పాంబ్రాణి, అగరభత్తీలు, అక్షితలు, కర్పూరం, గంధం, పుష్పములు, పసుపు కుంకుమ, పంచామృతము, (పాలు, పెరుగు, నెయ్యి, తేనె, పంచదార) అరటి పండ్లు, పత్రి, హారతి పళ్లెం, గంట, నైవేద్యము, ఆకులు, వక్కలు, విడి గ్లాసులు, చెంబు, అగ్గిపెట్టె, బెల్లం, పెసర పప్పు, పానకము మొ॥ దీపారాధనచేసి, అగరబత్తీలు వెలగించి పూజను ప్రారంభించవలెను. మొదట "ఓంకారం" (3+5+11+21) చేసి గణపతి

శ్లో॥ "శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనమ్ ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే"

ఆచమనం : రాగి పాత్రలోని నీటిని ఉద్ధరిణితో చేతిలో పోసుకొని

1. ఓం కేశవాయస్వాహ (స్వాహ) 2. ఓం నారాయణాయస్వాహ (స్వాహ) 3. ఓం మాధవాయ స్వాహ (స్వాహ) అంటూ మూడుసార్లు త్రాగవలెను.

4. ఓం గోవిందాయనమః (నీటిలో చేతులు కడగవలెను)

5. ఓం విష్ణవేనమః.... 24. ఓం శ్రీకృష్ణాయనమః (అంటూ నమస్కారము చేయవలెను.)

ప్రాణాయామం: (బొటనవ్రేలితో కుడిముక్కు మూసి)
"ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య
ధీమహిధియోయోనః ప్రచోదయాత్"
(ముక్కు విడువుము)

సంకల్పం : గోత్ర నామములతో సంకల్పం చేయవలెను. తర్వాత గణపతి పూజచేసి, చివర ఉద్వాసన చేయవలెను.

**ఇష్టదేవతా పూజ ప్రారంభం : - అమ్మవారి ధ్యానం**

"లక్ష్మీం క్షీర సముద్ర రాజతనయాం, శ్రీరంగధామేశ్వరీం
దాసీ భూత సమస్త దేవతానితాం, లోకైక దీపాంకురామ్
శ్రీమన్మనద, కటాక్ష, లబ్ధి, విభవద్బ్రహ్మేన్ద్ర గంగాధరాం
త్వాత్రైలోక్య కుటుంబినీం, సరసిజాం వందే ముకుందప్రియాం"

శ్రీ వల్లూరమ్మ దేవతాయై! దేవతాభ్యోనమః ద్యాయామి ధ్యానం సమర్పయామి (పుష్పములు, అక్షితలు వేయవలెను).

1. ఆవాహనం (ఆహ్వానించుట) పురుషసూక్తం.
సహస్రశీర్షాపురుషః సహస్రాక్ష సహస్రసాత్
సభూమి విశ్వతోవృత్వా ఆత్యతిష్టదశాంగులం
శ్రీసూక్తం: శ్రీహిరణ్య వర్ణాం హరిణీం సంవర్ణరజత స్రజాంచందు
హిరణ్మయీం, లక్ష్మీం జాతవేదోమమావహయామి.

శ్రీ ఉల్కాముఖి వల్లూరమ్మ దేవతాయై, దేవతాభ్యోనమః ఆవాహయామి. (పటముపై అక్షతలు, పువ్వులు వేయవలెను.)

2. ఆసనం (సింహాసనం కూర్చొనుటకు పీఠం వేయవలెను)

3. పాద్యం (పాదములు కడుగుకొనుటకు నీళ్ళు అందించుట)

4. ఆర్ఘ్యం (చేతులుకు) 5. ఆచమనీయం చేయుట (నీళ్ళు వదలుట)

6. స్నానం (స్నానం చేయించుట) 7. వస్త్రం (వస్త్రం కట్టించుట)

8. యజ్ఞోపవీతం (జంద్యమును శుద్ధిచేయుట)

9. ఆభరణములు (అలంకరించుట)

10. గంధం (గంధం పూయుట)

11. పుష్పం [దండ (మాల) వేయుట] 12. అక్షితలు (వేయుట)

## శ్రీ లక్ష్మి అష్టోత్తర శతనామావళి

ఓం ప్రకృతయే నమః
" విద్యాయై నమః
" వికృతయే నమః
" స్వరభూతహిత ప్రదాయే నమః
" శ్రద్ధాయే నమః
" విభూతయే నమః
" సురభయే నమః
" పరమాత్మికాయే నమః

ఓం కాంతాయే నమః
" కామాక్ష్యై నమః
" క్రోధసంభవాయే నమః
అనుగ్రహ ప్రదాయై నమః
" బుద్ధయే నమః
" అనఘాయే నమః
" హరివల్లభాయే నమః
" అశోకాయే నమః

ఓం వాచే నమః
" పద్మాలయాయై నమః
" పద్మాయే నమః 11
" శుచయే నమః
" స్వాహాయే నమః
" స్వదేశాయనమః
" సుదాయే నమః
" దన్యాయే నమః
" హిరణ్మయే నమః
" లక్ష్మ్యయే నమః
" నిత్య పుష్టాయే నమః
" విభావర్యై నమః 20
" అదిత్యై నమః
" దిత్యై నమః
" దీప్తాయే నమః
" వసుదాయే నమః
" వసుదారిణ్యై నమః
" కమలాయే నమః 26
" ప్రసాదాభిముఖ్యై నమః
" ప్రబాయే నమః
" చంద్రవదనాయే నమః
" చంద్రాయే నమః
చంద్ర సోదర్యై నమః
" చతుర్భుజాయే నమః
" చంద్రరూపాయే నమః
" ఇందిరాయే నమః 60
" ఇందు శీతలాయే నమః
" ఆహ్లాదజనన్యై నమః

ఓం అమృతాయే నమః
" దీప్తాయే నమః
" లోకశోకవినాశిన్యై నమః
" ధర్మనిలయాయే నమః

కరుణాలోక మాత్రేనమః
ఓం పద్మప్రియాయే నమః 40
" పద్మహస్తాయై నమః
" పద్మోద్భవాయే నమః
" పద్మముఖ్యై నమః
" పద్మనాభప్రియాయే నమః
" రమాయే నమః
" పద్మమాలా ధరాయై నమః
" దేవ్యై నమః
" పద్మగందిన్యై నమః 50
" పుణ్యగందాయే నమః
" సుప్రసన్నాయే నమః
" సులభ దర్శనాయ నమః 52
" హరిణ్యై నమః
" హేమమాలిన్యై నమః
" ధనదాన్యకారిన్యై నమః
" సిద్ధియే నమః
" సౌమ్యాయేనమః
" శుభప్రదాయే నమః
" నృపవేషయుతానందాయై నమః
" వరలక్ష్మై నమః
" వసుప్రదాయే నమః
" శుభాయే నమః

ఓం పుష్ట్యై నమః
" శివాయే నమః
" శివకర్యై నమః
" సత్యై నమః
" విమలాయే నమః
" విశ్వజనన్యై నమః
" తుష్టయే నమః
" దారిద్ర్యనాశిన్యై నమః
" ప్రీతిపుష్కరిణ్యై నమః
" శాంతాయే నమః
" శుక్లమాల్యాంబరాయే నమః
" శ్రియై నమః
" భాస్కర్యై నమః
" బిల్వనిలయాయే నమః
" వరారోహాయేనమః
" యశస్విన్యై నమః
" వసుంధరాయే నమః
" ఉదారాంగాయే నమః 80

ఓం హిరణ్య ప్రాకారాయే నమః
" సముద్రతనయాయే నమః
" జయాయే నమః
" మంగళాయే నమః
" దేవ్యై నమః
" విష్ణువక్షస్థల స్థితాయై నమః
" విష్ణుపత్న్యై నమః
" ప్రసన్నాక్ష్యై నమః 98
" నారాయణ సమాశ్రితాయే నమః
" క్షీరసాగరకన్యకాయే నమః
" దారిద్ర్యధ్వంసిన్యై నమః
" లోకమాత్రే నమః
" సర్వోపద్రవవారిణ్యై నమః
" వనదుర్గాయే నమః
" మహాకాళ్యై నమః 105
" బ్రహ్మ విష్ణు శివాత్మికాయే నమః
" త్రికాలజ్ఞానసంపన్నాయ నమః
" భువనేశ్వర్యై నమః 108

(తర్వాత ధూపదీపనైవేద్య మంగళహారతులు చేయవలెను)

   

ధూపం : (అగరబత్తీలు వెలిగించి, పొగచూపుట)

దీపం : (కర్పూరం వెలిగించి, అమ్మవారికి చూపుట)

నైవేద్యము : (గాయత్రీ మంత్రం చదివి పదార్థములపై నీరు చల్లుట) శ్రీ వల్లూరమ్మ దేవతాభ్యో నమః నివేదన సమర్పయామి. అమృత మస్తు. అమృతోపస్తరణమసి. (నీరుచల్లి) ఓం ప్రాణాయస్వాహా, 2) ఓం సమనాయస్వాహా 3) ఓం ఉదానాయస్వాహా 4) ఓం సమానాయ స్వాహా 5) ఓం పరబ్రహ్మణే స్వాహా.

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి

తాంబూలం (తాంబూలం సమర్పయామి)

నీరాజనం (కర్పూరం) సమర్పయామి.

మంత్రపుష్పం సమర్పయామి.

ప్రదక్షిణం, నమస్కారం (అపరాద నమస్కారం)

ఉద్వాసనం ; (పటమును తూర్పు జరపవలెను)

శ్రీ వల్లూరమ్మ దేవతాయై దేవతాభ్యోనమః యని ప్రతి పనికి చెప్పవలెను.

పూజానంతరం భక్తి విశ్వాసములతో ఒకింత సేపు నామస్మరణ (భజన) చేసిన తర్వాత తీర్థ ప్రసాదములు పొందుట పుణ్యం పురుషార్థం కలుగుతుంది.

* * * *

సిద్ధి వినాయక ధావయ్యా నీ సరిదైవము లేరయ్యా
దినదిన మంగళ ప్రేమమయా కోరితి నీ దయ కృపనిలయా (1)
పతితపావన నీ కరుణ నిలుపుము మాపై గణనాధా
గణనాధాయని పిలిచినచో పలికెడి స్వామి శుభచరణ. (2)
దీనుల బ్రోచెడి దైవమని నీ శరణములే నమ్మితిని
నీ పాదదాసుల మొరలినవా. గణనాధ నీదయ రాద. (3)
గిరదర సుందర ప్రియవదన పాపవినాశ శుభచరణ
నీ పాదదాసుదాల మొరలినవా విఘ్నాదిప గణనాద. (4)

★ ★ ★ ★

శివశివమూర్తివి గణనాద నీవు శివునీ కుమారుడవు గణనాడ
పార్వతినందన గణనాద నీవు పరమ నిరంజన గణనాద
మోదకహస్తా గణనాద నీవు ముక్తిప్రదాత గణనాద
భక్తులంతా నినుకొల్వ గణనాద వారి బాధలను తీర్చినావు గణనాద
తొలిపూజ దేవుడవు గణనాద, నీకు ఉండ్రాళ్ళు తెచ్చినాము గణనాద
పూజలెన్నో చేసినాము గణనాద నిన్ను భక్తితోను కొలిచినాము గణనాద
ఎలుక వాహన మెక్కి గణనాద నీవు వేగముగ రావయ్య గణనాద
భజనలే చేసినాము గణనాధ మా బాధలను తీర్చవయ్య గణనాద.

★ ★ ★ ★

మా అమ్మ వల్లూరమ్మ చీరలె కట్టంగ (2)
చీరమీద ఆడింది నాగు. చీర అంచుమీద ఆడింది నాగు.
మా అమ్మ వల్లూరమ్మ రవికలే తొడగంగ (2)
రవికమీద ఆడింది నాగు రవిక అంచుమీద ఆడింది నాగు
మా అమ్మ వల్లూరమ్మ బొట్టునె పెట్టంగ (2)
బొట్టుమీద ఆడింది నాగు. బొట్టు అంచుమీద ఆడింది నాగు
మా అమ్మ వల్లూరమ్మ మెట్టెలే పెట్టంగ (2)
మెట్టెమీద ఆడింది నాగు మెట్టె అంచుమీద ఆడింది నాగు.

అంబపరమేశ్వరి అఖిలాండేశ్వరి ఆది పరాశక్తి పాలయమాం.
శ్రీ భువనేశ్వరి రాజరాజేశ్వరి ఆనందరూపిణి పాలయమాం.
వీణాపాణి హిమలసరస్వతీ వేదాంతరూపిణి పాలయమాం.
మంజులభాషిణి మంగళదాయని మధురమీనాక్షి పాలయమాం. (1)

రాజస్వరూపిణి శ్రీచక్రవాహిని రాజరాజేశ్వరి పాలయమాం.
కరుణా రూపిణి అన్నపూర్ణేశ్వరి చాముండేశ్వరి పాలయమాం.
శ్రీచక్రనాయకి త్రిపురసుందరి శ్రీలలితేశ్వరి పాలయమాం.
చాముండేశ్వరి గౌరీమనోహరి పార్వతీమాతా పాలయమాం. (2)

అంబజగదీశ్వరి కాషాయాంబరి కాళిపరాశక్తి పాలయమాం.
కంచి కామాక్షి మధురమీనాక్షి చాముండేశ్వరి పాలయమాం.

★ ★ ★ ★

శ్రీ లక్ష్మిదేవీ మా పూజలు గైకొనుమా.
పుష్పములోన నీవు జన్మించితి వోయమ్మా.
గలగలలాడే నీ కాలిగజ్జలు మ్రోగంగా
నీ దివ్యశరణములే నమ్మితిమదిలోనా. ॥శ్రీ॥

ఆదిలక్ష్మిగనీవు అలరారుచుంటివమ్మా
నీ భక్తులబ్రోవంగా వేవేగమె రావమ్మా
నీ కరుణ మాకొసగి ధన్యులచేయమ్మా ॥శ్రీ॥

క్షీరసాగరమందు శ్రీ శేషాతల్పమున
శ్రీలక్ష్మినారాయణుని పాదములొత్తంగా
వరుసగను భక్తులకు ధర్శనమీవమ్మా ॥శ్రీ॥

6)

బూది విబూది దాల్చిన ఫలమెమొచెప్పుమా ఆ ఫలమెమొచెప్పుమా.
అంబికా పార్వతీ అడిగెను శంకరుని ఇక అడిగెను శంకరుని ॥బూ॥

1) ప్రొద్దున్నే విబూది ధరించుకుంటే ఇక ధరించుకుంటే
కాశీలో స్నానంబు చేసీ నంతఫలము ఇక చేసీ నంతఫలమూ ॥బూ॥

2) మధ్యాహ్నాం విబూది ధరించుకుంటే ఇక ధరించుకుంటే
మహానందిలో స్నానంబు చేసినంత ఫలము ఇక చేసినంతఫలమూ.

3) సాయంత్ర విబూది ధరించుకుంటే ఇక ధరించుకుంటే
ఆశాపిశాచములకు ఆజ్ఞవిబూది
పొద్దుపోయి విబూది ధరించుకుంటే ఇక ధరించుకుంటే
పాపాలు పోవు ఇక పుణ్యంబు కలుగు. ॥బూ॥

★ ★ ★ ★

శ్రీశైలం శివమయం. శ్రీమల్లిఖార్జున స్థావరం.
కైలాసమే నీ నివాసం. స్వయంభువై వెలసె నిచ్చట ॥శ్రీ॥

అరయ శివుడే దివినివదలి ధరణిపై తన కొలువు సేయగా
సిరులు మెండుగ తెంచుకొనగ స్వయంభువువై వెలసె నిచ్చట ॥శ్రీ॥

మునులు సాదులు వేదాంతులు పరమయోగులు మహామహులు
తపముచేసి తరించు భాగ్యము మోక్షంబు కలుగునిచ్చట
పాహి పాహి శంకరా మహేశ్వరా ఈశ్వర
శశిధర హరహరా పరమేశ్వరా పాహిమాం.

★ ★ ★ ★

అమ్మా అమ్మా సరస్వతీ అక్షరభారతీ సరస్వతీ
జయజయ జననీ సరస్వతీ జగజ్జననీ సరస్వతీ
కలము చేత ధరించియున్న కావలెను నీ దయ సరస్వతీ
కమ్మనివాక్కులు నాలోన కల్గించమ్మా సరస్వతీ

సంగీతమున నీ వీణా సాధనమమ్మ సరస్వతీ
భక్తులమదిలో నీపాట పలికించమ్మ మహాదేవి
వీణాపాణి సరస్వతీ పుస్తకపాణీ సరస్వతీ
మమ్ములచల్లగా దీవించి నీ కృప మాపై కలిగించు (2)

భాగ్యాధనలక్ష్మి రావమ్మా జయమ్మాలక్ష్మి భాగ్యధనలక్ష్మి రావమ్మా
కాళ్ళ అందియలు ఘల్లన మ్రోగగ ఆభరణములు తళతళమెరయ
పూజచేసే వేళకు రావమ్మా పురందర విఠలుని పట్టపురాణీ ॥భా॥

జాజిపువ్వులు సంపెంగపూలు నాలుగు రకముల పూలు తెచ్చి
పూజచేసే వేళకు రావమ్మా పురంధర విఠలుని పట్టపురాణీ ॥భా॥

పసుపు కుంకుమ వస్త్రం గంధం అన్నియు మేము పట్టుకవస్తే
పూజచేసే వేళకు రావమ్మా పురంధర విఠలు పట్టపురాణీ ॥భా॥

చంకన బిడ్డలు సంపదలిచ్చి మంచిగానుండే పుత్రులనిచ్చి
ఇష్టములతో మా ఇంటికివచ్చి అష్టైయిశ్వర్యము లివ్వవే తల్లీ ॥భా॥

శుక్రవారము నీ పూజలను భక్తితో శ్రద్ధగా చేయుచు నుంటిమి
పూజచేసే వేళకు రావమ్మా పురంధర విఠలుని పట్టపురాణీ ॥భా॥

   

## "పోతేరమ్మ"

అందరుగూడి భజనలుచేస్తే ఎందుకురాదు పోలేరమ్మ
మనసున తలచి మరిమరి వేడితే తప్పక వచ్చును పోలేరమ్మ (1)
బ్రహ్మంగారు అమ్మఅనగా నిప్పును తెచ్చి యిచ్చెకదా
ముక్కున వ్రేలుతీసి మరి వేశ్యకు మోక్షము యిచ్చెకదా (2)
దుష్టమానవుల దర్పము అణచి భక్తుల బాధలు తీర్చెకదా
కోరి భజించిన భక్తులకు కోరికలొసగెను పోలేరమ్మ (3)
ముదముతోటి ముజ్జగములను మురిపెములోనా సృష్టించి
లాలనచేసి పాలన చేయుచు రక్షణ చేయుచున్నదిగా (4)
భక్తితో పూజలు చేసెదము నిరంతరము మదిలో తలచెదము
పరాకు సేయక మాపై నీవు పరుగున రావమ్మ పోలేరమ్మ

★ ★ ★ ★

## "గంగమ్మ తల్లి"

(కనుపాప కరువైన కనులెందుకోనుండిరి)

శ్రీదేవి గంగమ్మ రా వేగమే-నీ
సేవలను చేయ వచ్చియుంటిమి తల్లి వచ్చియుంటిమి (1)
ఫలములతో పుష్పములతో సేవించగ
మా కోర్కెలన్నీ నీవు నెరవేర్చగ
దయతోడ మముగాచి రక్షింపుమా తల్లి రక్షింపుమా (2)
రాగతాళ భజనలతో కీర్తింపగా
హృదయంబులో నీవు పులకింపగా
మైమరచియున్నాటి మముగావుమా తల్లి మముగావుమా (3)
వల్లూరు చెంత నీవు వెలసితివి
భక్తుల మదిలోన నిలచితివి
గ్రహబాధలన్నిటిని తొలగించుమా తల్లి కరుణించుమా (4)
పుడమిలో వల్లూరు పురమందునా
నరసింహం సమకూర్చు పాటలందునా
తప్పులున్న నన్నుగాచి కాపాడుమా రక్షింపుమా (5)

ఓం కామాక్షమ్మ మీనాక్షమ్మ శరణమమ్మతల్లి నీకు శరణమమ్మ తల్లి
నీవు ఆదిపరాశక్తివే శరణమమ్మ తల్లి నీకు శరణమమ్మ తల్లి ॥కా॥

మద్దిపాడు మాలక్ష్మమ్మ శరణమమ్మ తల్లి నీకు శరణమమ్మ తల్లి
నీవు ఆదిపరాశక్తివే శరణమమ్మతల్లి నీకు

ఉలవపాడు అంకమ్మ శరణమమ్మ తల్లి నీకు శరణమమ్మ తల్లి
నీవు ఆదిపరాశక్తివే శరణమమ్మ తల్లి నీకు

వల్లూరు వల్లూరమ్మ శరణమమ్మ తల్లి నీకు శరణమమ్మ తల్లి
నీవు ఆదిపరాశక్తివే శరణమమ్మతల్లి నీకు

వల్లూరు గంగమ్మ శరణమమ్మ తల్లి నీకు శరణమమ్మ తల్లి
నీవు ఆదిపరాశక్తివే శరణమమ్మ తల్లి నీకు

వల్లూరు వల్లూరమ్మ శరణమమ్మ తల్లి నీకు శరణమమ్మ తల్లి
నీవు ఆదిపరాశక్తివే శరణమమ్మ తల్లి నీకు

బెజవాడ కనకదుర్గ శరణమమ్మ తల్లి నీకు శరణమమ్మ తల్లి
నీవు ఆదిపరాశక్తివే శరణమమ్మ తల్లి నీకు

(కంచి కామాక్షమ్మ, మధుర మీనాక్షమ్మ, కాశీ విశాలాక్షి, కలకత్తా కాళికాంబ, మైసూరు చాముండేశ్వరి, శబరిగిరి మంజుమాత మొ॥)

   

ఏమిశంకర నీదు మహిమ ఎవ్వరికి తెలియదాయె
పాలు కలిపిన పంచామృతము ఎంగిలంటివి శంకరా
గంగ జలముతెచ్చి నీకు లింగపూజలు చేతమంటే
గంగనున్న కప్ప చేప ఎంగిలంటివి శంకరా ॥ఏ॥

ఆవుపాలు తెచ్చి నీకు అభిషేకము చేద్దమంటే
చిన్న చిన్న లేగదూడల ఎంగిలంటివి శంకరా ॥ఏ॥

పండ్లు ఫలములు తెచ్చినీకు నైవేద్యము యిద్దమంటే
పండు ఫలముకు రామచిలకల ఎంగిలంటివి శంకరా ॥ఏ॥

తుమ్మిపూలు తెచ్చినీకు తృప్తిగా పూజిద్దమంటే
కొమ్మ కొమ్మకు కోటి తుమ్మెద ఎంగిలంటివి శంకరా ॥ఏ॥

నారికేళము తెచ్చినీకు నైవేద్యము ఇద్దమంటే
అప్పుడైన ఒప్పుకుంటివి గరళకంఠ శంకరా ॥ఏ॥

★ ★ ★ ★

తిరుమల మందిర సుందరా హిమగిరి కరుణ సాగరా
ఏ పేరున నిన్ను పిలిచేనురా ఏరూపముగ నిన్ను కొలిచేనురా
పాలకడలిలో శేషశయ్యపై శయనించిన శ్రీహరివో
వెండికొండపై నిండు మనస్సుతో నివశించెన గౌరిపతివో
ముగ్గురమ్మలకు మూలటమ్మవై భువిలో వెలసిన ఆదిశక్తివో
కాంతులుచిందె నీ ముఖబింబము కాంచినచాలును ఘడియైనా
నీగుడివాకిట దివ్వెనునేనై గడిపినచాలును రేయైనా
నీ పదములపై సుమమునేనై నిలచిన చాలును క్షణమైనా

సాయంకాలం సమయంలో-సంధ్యాదీపారాధనరో
వచ్చెను తల్లి వల్లూరమ్మ-వచ్చింది తల్లి వరాల అమ్మ
మము కరుణించే మాయమ్మ-మము దీవించే మాయమ్మ
మము కాపాడే మాయమ్మ-మము కడతేర్చును మాయమ్మ
పాల సముద్రుని పుత్రికగ-పరంధాముని ప్రాణ సఖి
రావమ్మ ఇక రావమ్మ-మము దయ చూడగ రావమ్మ
సిగలో ఎన్నో పువ్వులూ-మెడలో ఎన్నో హారాలు
నవ్వుచు వచ్చెను మాతల్లి-మము దీవింపగ మాయమ్మ
ధనమును యిచ్చె ధనలక్ష్మి-ధాన్యము నిచ్చెధాన్యలక్ష్మి
వరముల నిచ్చె వరలక్ష్మి-కాపాడు దేవత ధైర్యలక్ష్మి
రాజ్యము నిచ్చె రాజ్యలక్ష్మి-విద్యనుయిచ్చె విద్యాలక్ష్మి
సంతాన మిచ్చె-సంతాన లక్ష్మి-విజయము నిచ్చె విజయలక్ష్మి

ఓం శక్తి ఓం శక్తి ఓం శక్తి ఓమ్
ఓం శాంతి ఓం శాంతి ఓం శాంతి ఓం.
ఇచ్ఛా శక్తి- పారా శక్తి వల్లూరమ్మా
జ్ఞానశక్తి- దివ్యశక్తి వల్లూరమ్మా. 1
తల్లి వలన- జగములన్ని సృష్టి చెందెను
సృష్టిచెంది- తల్లివలన వృద్ధిపొందెను.
ఆదిశక్తి మూర్తులకు ముక్తి కాంత
మూర్తులందరు దేవినెప్పుడు వేడుచుందురు 2
ఆమె కరుణ తప్పకుండ అందుచుండును
అట్టిదేవిని పట్టుకొని నమ్మి కొలవండి 3

## మంగళహారతి

హారతి గైకొనుమా మంగళహారతి గైకొనుమా
అమ్మలగన్న వల్లూరమ్మా హారతి గైకొనుమా
జయహారతి గైకొనుమా శుభహారతి గైకొనుమా ॥హా॥

ఆపదమొక్కుల అమ్మవు నీవని ఆదరించి మముబ్రోచెదవని
నిశ్చల భక్తితో నిన్ను వేడుచును మంగళహారతి అర్పించితిమి ॥హా॥

కలియుగంబున కల్పతరువై వల్లూరమ్మగా వెలసిన తల్లీ
పిల్లజనులను కాపాడుదువని మంగళహారతి మరి ఇచ్చితిమి ॥హా॥

ధర్మముతప్పక చరించువారికి ధనధాన్యములు కలగించుచును
గాలి ధూళి సోకినవారికి అభయముయిచ్చి దీవించుచును
కొలిచినవారికి కొంగుబంగారమై-పిలిచిన వారికి పలికే దైవము
హారతిలిచ్చి వేడుచుంటిమి మాబాధలు తీర్చగరావమ్మా ॥హా॥

* * * *

ఓం మంగళం! ఓంకార మంగళం! ఓం నమః శివాయ మంగళం.
న. మంగళం నకార మంగళం-నాదబిందు కళాతీత గురువే మంగళం
మ. మంగళం మకారమంగళం మందహాస భక్తహాస గురువే మంగళం
శి. మంగళం శ్రీకారమంగళం సిద్ధిబుద్ధి రూపనాద గురువే మంగళం
వ. మంగళం వకార మంగళం వాదబేధ రూపనాద గురువే మంగళం
య. మంగళం యకార మంగళం యల్లరూప యక్షసిద్ధి గురువే మంగళం

సచ్చిదానంద మంగళం సాదురక్ష మంగళం
శివాయ మంగళం సద్గురువే మంగళం

* * * *